ప్యారీస్
మిఠాయిలు
మరియు
బిస్కట్లు
అందరికీ
ఇష్టం

# PARRY'S Special

## పిల్లల్లారా

రారండోయ్. ప్యారీస్ మీకోసం మళ్ళీవచ్చింది. మరింత వినోదం తెస్తోంది. ఈ 4 పేజీల స్పెషల్ మీకోసం, మీ ఇంట్లో అందరి కోసమూ. ఇందులో చెప్పినవి మీరు చక్కగా చేసుకోవచ్చు. అన్నీ చిన్న చిన్నవి. అద్భుతంగా వుంది గదూ? అందుకే ఈ ప్యారీ స్పెషల్‌ని కత్తిరించి దాచుకోండి. మీకు తీరిక వున్నప్పుడు ఇవన్నీ చేసుకుని ఆనందించండి. వినోదించండి.

CARAMILK

COFFY BITE

LOLLIPOP

Try-Me

### మీ స్నేహితులని ఆశ్చర్యపరచడానికి, అద్భుతాలు

తేనెటీగ తనకన్నా 300 రెట్లు ఎక్కువ బరువు మోయగలదు



ఇంగ్లీషుకి 26 అక్షరాలు వున్నాయని అందరికీ తెలును. ఎక్కువ అక్షరాలు వున్న భాష సింహాలీస్. 54 అక్షరాలు వున్నాయి. తక్కువ అక్షరాలు వున్న భాష హవాయి. 12 అక్షరాలే!

abc

MTA-7531-A










చూడండి!
మీరే ఒక ప్యాడిల్ స్టీమర్ చేసుకోవచ్చు ఎలాగంటారా? ఒక థర్మోకోల్ షీటు, 6 సెం.మీ × 3.5 సెం.మీల దళసరి అట్ట, రెండు ఎలాస్టిక్ బ్యాండ్‌లు, పెన్సిల్, చిన్న అగ్గి పెట్టె, రంగుల కాగితం, ఫెవికాల్, దారం, పెయింట్‌లు మీకు కావాలి. మీనాన్నగారిని థర్మోకోల్ నుంచి ఇక్కడ చూపించినట్లు 8 సెం.మీ × 5 సెం.మీ వుండే ముక్కని కత్తిరించి ఇమ్మనండి. అగ్గిపెట్టె మీద ఫెవికాల్ రాయండి. ముందు వైపు పెన్సిల్ మొనని గుచ్చి కాగితం జెండా వుంచండి. వెనుక చివరల చుట్టూరా ఎలాస్టిక్ బ్యాండ్‌లు వుంచి వాటిని దారంతో కట్టండి. ఇప్పుడు, దారం క్రింద అట్టముక్కని వుంచి తిప్పి కదలనివ్వండి. మీ స్టీమర్ నీళ్ళలో వేగంగా ప్రయాణం ప్రారంభిస్తుంది.





మీకు తెలుసా? ... గుడ్లపక్షి అనిపిలిచే దక్షిణ అమెరికా ... నీలం, ఆకుపచ్చ, గులా... పసుపు మరియు ఊదా... రంగులలో రంగు రంగుల గ్రుడ్లు పెట్టుంది.

ఉదయం టిఫిన్ తినేటప్పుడు కోడిగ్రుడ్డు తింటారా? అయితే దాని పెంకు మట్టుకు పారెయ్యకండి. కోడిగ్రుడ్డు పెంకులని సేకరిస్తే యిక్కడ చిత్రంలో చూపించినట్లు పదివేళ్ళకీనవ్వు పుట్టించే ముఖాలని తయారు చేసుకోవచ్చు. మీ అమ్మతో గ్రుడ్డు సన్నగా వుండే వైపు చిన్న కన్నంచేసి గ్రుడ్డుని విరగగొట్టమని చెప్పండి.











## భలేభలే తమాషాలు కావాలా

ఇది ఎంతో సులభమైనది. చూడండి. ఒక అట్ట, కత్తెర, దారం, పెయింట్, మగ్ లేక గ్లాసు తెచ్చుకోండి. మగ్‌తో ఒక వృత్తం గీయండి. చక్కగా ఆ వృత్తాకారాన్ని కత్తిరించండి. ఈ వృత్తాన్ని 7 త్రిభుజాలుగా విభజించండి. వాటిని ఇంద్రధనస్సు రంగులలో ఎరుపు, నారింజ, పసుపు, ఆకుపచ్చ, నీలం, నీలి, ఊదాలలో, చిత్రించండి. ఇక్కడ చూపించినట్లు మధ్య భాగానికి అటూ ఇటూ రెండు రంధ్రాలు చేయండి. దానిలోంచి ఒకదారపు ముక్క దూర్చి చివరలు కలిపి ముడి వేయండి. రెండు కన్నాలలోంచి మీవేళ్లు పోనిచ్చి చక్రాన్ని గిరగిరా తిప్పండి. మీరు పూర్తిగా తిప్పి వదిలినప్పుడు చక్రం మీద రంగులు తెల్లగా మారి పోతాయి. మీకు తెలీదు గదూ తెలుపుని ఇంద్రధనస్సులోని ఏడు రంగులుగా విడగొట్టవచ్చని!











సరదాగా ఒక గొంగడి పురుగు బండిని తయారు చేయ్యండి. ఎలా? అమ్మని నాలుగు కాటన్ రీల్స్, ప్లాస్టిక్ బాటిల్, వంపులు తిరిగిన అట్టముక్క, ఎమల్షన్ పెయింట్, రెండు పెన్సిళ్లు, కొంత ప్లాస్టిసిన్, స్కాచ్ టేప్ కావాలని అడగండి. ఇక్కడ చూపించినట్లు బాటిల్ ఆకారాన్ని కత్తిరించండి. అమ్మసహాయం తీసుకోండి. మీకు నచ్చిన రంగు వెయ్యండి. ఆరనివ్వండి. పూర్తిగా ఆరిన తర్వాత చిత్రంలో గుర్తు పెట్టినట్లు పైభాగంలో రెండు, క్రింది భాగంలో రెండురంధ్రాలు చేయండి. రంధ్రాల లోంచి రెండు పెన్సిళ్లు పెట్టండి. పెన్సిళ్ల చివర నాలుగు కాటన్ రీల్స్ చేర్చి వాటిని ప్లాస్టిసిన్ ముద్దలతో అతికించండి. వంపులు తిరిగిన అట్టముక్కలో రెండు ముక్కలు కత్తిరించండి. వాటిని చక్రాల చుట్టూ తిప్పి స్కాచ్ టేప్‌తో కలిపి అతికించండి. చిత్రంలో చూసినట్లు

- కిటికీలు పెట్టండి. మీ ముద్దుల
- తమ్ముడికి బహుకరించండి.

ఎందుకు నచ్చదు?

## క్రాస్‌వర్డ్ ప్రారంభిద్దాము



ఇక 'క్రాస్‌వర్డ్' ప్రారంభిద్దాము. జవాబులు ఏమిటో తెలుసా? అన్నీ ప్యారీస్ మిఠాయిల పేర్లే! సులభంగా వుండదా మరి?

క్లూలు :

1. క్యారమిల్ మరియు పాలు పూర్తిగా చేరి వున్నది - అదే నేను
2. రుచి చూడడానికి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాం - నేనెవరు?
3. నేను కాఫీ టాఫీని - నన్ను గుర్తించండి
4. నేను నోరూరిస్తాను - నాపేరేమిటి?
5. నేను మింట్ + టాఫీ - నేనెవరు?
6. పాల మిఠాయిల రాజాని నేను- ఊహించండి నేనెవరో
7. నేను మిఠాయిల మహారాజాని - నేనెవరు?

(జవాబులు ఆఖరి పేజీలో)

## అద్భుతమైన వాస్తవాలు మరెన్నో



- పెద్దనీటి మొక్క ఏమిటో తెలుసా? రాక్షసలిలీ. ఇది అమెజాన్‌లో వుంది. ఇది 10 అడుగులు వుండే దాని ఆకుల మీద చిన్న పాపని పడిపోకుండా పడుకోబెట్టుకుంటుంది!
- మీకు తెలుసా సీటిగుర్రపు పిల్లలు సీటిలోపలే పుట్టాయనీ
- డాల్ఫిన్ చేపలు ఎప్పుడూ ఒక కన్ను తెరచే నిద్రపోతాయనీ









## పేపర్ మ్యాష్ తెలుసా?

అనిపిస్తున్నంత కష్టంగా వుండదు. ప్రయత్నించి చూడండి. అమ్మకి లేక అక్కయ్యకి యివ్వడానికి ఒక గిన్నె తయారు చేయండి. మీకు కావలసినది పాత న్యూస్ పేపర్, పిండి, పేస్ట్ చేయడానికి నీళ్ళు, కొన్ని పెయింట్లు.

మీకు నచ్చిన ఒక గిన్నె తీసుకోండి. పిండి, నీళ్ళతో కొంత పేస్ట్ తయారు చేయండి. న్యూస్ పేపర్‌ని సన్నని చిన్న ముక్కలుగా కత్తిరించండి. పేస్ట్‌లో ముంచండి. గిన్నె లోపలంతా పూర్తిగా రాయండి. ఆరనివ్వండి. అప్పుడు లోపల దళసరి పెంకులాగా వచ్చేవరకూ మరికొంత రాయండి. పూర్తిగా ఆరనివ్వండి. ఇప్పుడు గిన్నెలోంచి బయటకు జారేటట్లు చెయ్యండి... సులభంగానే బయటకు వస్తుంది. మీకు నచ్చిన డిజైన్‌లో పోస్టర్ పెయింట్ వెయ్యండి. అందులో చిరుతిళ్లు వుంచుకోడానికి అమ్మకికాని అక్కయ్యకి కాని బహుకరించండి. దానిని తలక్రిందులుగాచేసి పైన ఒక రంధ్రం పెట్టి మీ ఇంట్లో ల్యాంప్ షేడ్‌గానూ వుపయోగించు కోవచ్చు!

పిల్లలారా మీరు ఎప్పుడూ ఎంతో ఆనందంగా గడపాలి. అదే ప్యారీస్ తియ్యటి కోరిక అందుకే ఈ వినోదకరమైన వస్తు మీరే స్వయంగా చేసుకోండి. అతి త్వరలో మేము అందించే మరెన్నిటికోసమో చూడండి.

**జవాబులు**

1. Caramilk
2. Try Me
3. Coffy Bite
4. Lollipop
5. Mint Eclair
6. Lacto King
7. Parrys




## ఇక అందిస్తుంది ప్యారీస్ మేటి వినోదం

ఔను. మిమ్మల్ని ఆనందంలోనూ, ఆశ్చర్యంలోనూ పూర్తిగా ముంచు తుంది. మీ వంటి పిల్లలకోసం ప్యారీస్ పుస్తకం వస్తోంది. ప్యారీస్ మిఠాయిలు [ప్యారీస్ క్యారమిల్క్ లేక ప్యారీస్ కాఫీబైట్ మాత్రమే] రాపర్లు 25 సేకరించండి. వాటిని Parrys the king of Sweets, P.O. Box. 2040, Madras 600001. చిరునామాకి పంపించండి. మేము మీకు సరికొత్త వినోదంతో నిండిన అన్నీ మీరు చేసుకోగల వింతలతో వున్న పుస్తకాన్ని పంపుతాము. త్వరపడండి. / సేకరించండి. పంపండి. ఈ సదుపాయము సెప్టెంబర్ 15,1990 వరకు వున్నది.







THE KING OF SWEETS

# చందమామ

సంస్థాపకుడు: 'చక్రపాణి'    సంచాలకుడు: నాగిరెడ్డి

## మాదక ద్రవ్యాల ప్రమాదం!

ఐక్యరాజ్య సమితి విద్యా సాంస్కృతిక విభాగం పిలుపు మేరకు ప్రపంచమంతటా జూన్ 26 వ తేదీని మాదక ద్రవ్యాల వ్యతిరేక దినంగా ఆచరించడం జరిగింది.

మాదకద్రవ్యాలు నేటి యువతరాన్ని నాశనం చేయడమే కాదు; మనిషి భవిష్యత్తుకే గొడ్డలిపెట్టుగా దాపురిస్తున్నవి. మాదకద్రవ్యాలకు అలవాటుపడినవారు తమను తాము నాశనం చేసుకుని తమవారికందరికీ తీరని బాధ కలిగిస్తున్నారు. ఈ దురలవాటుకు బానిసలైనవారు మొదట నిర్వీర్యులైపోయి, ఆ తరవాత అరాచకవాదులుగా మారే అపాయం కూడా ఉన్నది. మత్తు పదార్థాలపై ఆధారపడటంవల్ల, సంఘద్రోహులయిన మాదక ద్రవ్య వ్యాపారులను పోషించడం జరుగుతుంది. అధిక లాభాలపై దురాశకొద్దీ యువతరాన్ని సర్వ నాశనం చెయడమే కాదు; తమ ధన బలంతో కొన్ని దేశాల రాజకీయాలను సైతం ప్రభావితం చేయగలుగుతున్నారీ పాతకులు!

ఈ అపాయాన్ని అరికట్టడానికి ప్రతిఒక్కరూ పాటుపడాలి. ఈ విషవలయంలో మీ మిత్రులెవరైనా చిక్కుకున్నట్టయితే వారిని వెలికి తేవడానికి చేయూతనివ్వండి. ఈ విషయంలో విశ్వాసపాత్రులైన పెద్దలనూ, మీ ఉపాధ్యాయులనూ సంప్రదించి సలహాలు పొందడం శ్రేయస్కరం!

సంపుటి 87    జూలై '90    సంచిక 1

విడి ప్రతి: 3-00    సంవత్సర చందా: 36-00









లాస్ ఆఫ్ ది జంగిల్ గేమ్

స్నేక్ సఫారీ గేమ్

# మేగీ క్లబ్: రండి, అడవుల్లో సరదా విహారానికి!

## ఉచితం!




డిస్నీ టుడే, కామిక్

మీ బహుమతులను పొందండి

మీరు మేగీ నూడుల్స్ యొక్క అయిదు ఖాళీ సంచులకు ముందు వైపున ముద్రించబడి ఉండే ఈ [MAGGI 2-Minute లోగో] ను కత్తిరించి, మీరు ఎంచుకున్న ప్రతి ఉచిత బహుమతి కోసం వాటిని మాకు పంపించండి. అంతే! మీకు 6 నుంచి 8 వారాలలో మేగీ క్లబ్ నుంచి ఎంతో వినోదాన్ని, ఉత్సాహాన్ని కలిగించే బహుమతి అందుతుంది!

మర్చిపోకండి:

మీరు మేగీ క్లబ్ సభ్యులు కాని పక్షంలో, మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు కావలసిన బహుమతి పేరుతోపాటు మీ పేరు, చిరునామా పంపించండి. మీరు మేగీ క్లబ్ సభ్యులై ఉంటే, మీ సభ్యత్వపు నంబరు పంపించండి.





ఫారెస్ట్ ఫేసెస్ కేప్స్ మరియు మాస్క్




మా చిరునామా:
మేగీ క్లబ్ పి.బి. బాక్స్ 5788, న్యూ ఢిల్లీ:110055

జంగిల్ స్టాండీస్ సెట్

మరొక సదుపాయం కూడా:
మీరు యింతవరకు ట్రావెల్ ఇండియా గేమ్ యింకా సేకరించి ఉండకపోతే, యిప్పుడు సేకరించండి!

HTA 6679 TEL

# 'పాకిస్తాన్‌లో జరుగుతున్న దేమిటి?

**1933** వ సం॥లో చౌదరి రహ్మత్ అలి 'పాకిస్తాన్' అనే మాటను రూపొందించాడు. పాకిస్తాన్ అనే మాటకు 'పవిత్రుల భూమి' అని అర్థం చెబుతారు!

భారత ఉపఖండాన్ని, మత ప్రాతిపదికపై రెండుగా విభజించాలని, మహమ్మదాలీ జిన్నా నాయకత్వంలో ముస్లింలీగ్ పార్టీ కోరింది. ఆ కోరికను విజ్ఞులయిన వారందరూ నిరసించారు. స్వాతంత్ర్యం, సమానత్వం, ప్రజాస్వామ్యం మున్నగు ఉన్నత ఆశయాలతో మానవ జాతి సర్వస్వం ఒకటి కావాలన్న మహోన్నత లక్ష్యంతో ముందుకుసాగుతూన్న కాలఘట్టంలో— మతం పేరుతో ఒక దేశాన్ని రెండుగా విభజించడం వెనకడుగు వేసినట్టే అయింది!

భారతదేశం విభిన్నమతాలకే కాదు; భిన్న సంస్కృతులకూ, వివిధ భాషలకూ నిలయం. అప్పుడప్పుడూ అక్కడక్కడ ఒకటీ అరా కులమత కలహాలు జరిగినప్పటికీ, వాటికి దేశాన్ని విభజించడం పరిష్కారమార్గం కాదు. ఈ రకం సమస్యలు ఒక్క మనదేశానికి మాత్రమే పరిమితంకావు. ప్రపంచ దేశాలన్నిటిలోనూ తలెత్తాయి. పరస్పర అవగాహనతో, చర్చలతో, సరైన చట్టాలతో ఆ సమస్యలను పరిష్కరించడం జరిగింది. మనదేశ చరిత్రను తీసుకున్నా, పరిష్కరించలేని సమస్యలంటూ మతాలమధ్య ఏ కాలంలోనూ ఏర్పడలేదు!

పాకిస్తాన్ విభజన కోరికను వదులుకోమని, మన దేశంలోని ప్రముఖ నాయకులు—హిందువులూ, ముస్లింలూ ముస్లింలీగ్‌ను కోరారు. కాని ప్రయోజనం లేకపోయింది. 'విభజించి పాలించడ'మే సిద్ధాంతంగా గల బ్రిటిష్ పాలకులు ముస్లింలీగ్ కోరికను పరోక్షంగా ప్రోత్సహించారు.

ఆఖరికి దేశ విభజన జరిగినప్పటికీ, ముస్లింలీగ్ కోరిన ప్రాంతాలన్నీ పాకిస్తాన్ అధీనంలోకి రాలేదు. కాశ్మీర్ ఇండియాలోనే వుండిపోయింది.

ఆ తరవాత, పాకిస్తాన్‌లో ఒక భాగమైన తూర్పు పాకిస్తాన్‌లో తిరుగుబాటు జరిగి, అది స్వతంత్ర బంగ్లాదేశ్‌గా విడిపోయింది!

పాకిస్తాన్‌కన్నా ఇండియాలోనే ఎక్కువమంది ముస్లింలు నివసిస్తున్నారు. వారందరూ హిందువులలాగే, క్రైస్తవులలాగే, బౌద్ధులలాగే భారతదేశాన్ని తమ మాతృదేశంగా భావిస్తున్నారు. అయితే, పాకిస్తాన్ బంగ్లాదేశ్‌ను కోల్పోయిన అవమానాన్ని మరిచిపోకుండా, కాశ్మీర్‌లో

అధిక సంఖ్యాకులు ముస్లింలు అన్న పాత పల్లవిని పాడుతూ తరచూ కాశ్మీర్ కోసం కాలుదువ్వడం పరిపాటి అయిపోయింది. కొందరు కాశ్మీర్ యువకులను ఆకర్షించి, వారికి ఆయుధాలు ఉపయోగించడంలో శిక్షణనిచ్చి, కాశ్మీరులో అరాచకం సృష్టించడానికి పురికొల్పుతున్నది.

నిజానికి పాకిస్తాన్ అంతరంగిక పరిస్థితులు రోజురోజుకు దిగజారుతున్నవి. ఇండియానుంచి వలసవెళ్ళిన ముస్లింలకూ, పాకిస్తాన్ ముస్లింలకూ మధ్య తరచూ కలహాలతో రక్తపాతం జరుగుతున్నది. సరిహద్దు ప్రాంతాలలోని పఠానులకు పాకిస్తాన్ పాలకులపట్ల సదభిప్రాయంలేదు. విడిపోగలమని బెదిరిస్తున్నారు. అస్తవ్యస్తమైన అంతరంగిక పరిస్థితులనుంచి, ప్రజల దృష్టిని మరోవైపుకు మళ్ళించడానికే, పాకిస్తాన్ నాయకులు కాశ్మీర్ కోసం కయ్యానికి దిగుతున్నారు.

సామాన్య ప్రజలను మతం పేరుతో రెచ్చగొట్టడం ఇంకా కొనసాగడం దురదృష్టకరమైన విషయం!







మహమ్మదాలీ జిన్నా



# రాగికడియం

సీతాపురం అనే గ్రామంలో, శ్రీముఖుడనే మహాపండితుడుండేవాడు. ఆయన నిస్వార్థ బుద్ధితో ఎందరికో విద్యాదానం చేశాడు. ఎవర్నీ దేహీ అని అడక్కపోయినా, గ్రామస్థులాయనకు విలువైన కానుకలిచ్చి గౌరవించేవారు. అందువల్ల శ్రీముఖుడికి రోజులు సుఖంగానే గడిచిపోతున్నాయి. ఆయనకున్న విచారమల్లా ఒక్కటే—అది లేకలేక పుట్టిన కొడుకు చతుర్ముఖుణ్ణి గురించి.

చతుర్ముఖుడికి బొత్తిగా చదువబ్బ లేదు. అట్లని మంచి బుద్ధులూ లేవు. గ్రామంలో వాడు చేసే అల్లరిపనులకు శ్రీముఖుడి ముఖం చూసి సహిస్తున్నారు, సీతాపురం ప్రజలు. ఇదంతా చూసి శ్రీముఖుడు, చతుర్ముఖుణ్ణి బాగుచేయాలని ఎన్నో ప్రయత్నాలు చేసి విఫలుడయ్యాడు.

ఇలా వుండగా, ఒకరోజున శ్రీముఖుణ్ణి చూడడానికి మహానందుడనే శిష్యుడు వచ్చాడు. అతడు శ్రీముఖుడి దగ్గిర అన్ని విద్యలూ నేర్చుకున్నాక, అరణ్యాలకు పోయి తపస్సు చేసి కొన్ని అద్భుతశక్తులు సాధించాడు. ఇప్పుడతడు గురువైన శ్రీముఖుడికి, గురుదక్షిణగా ఏదైనా ఇచ్చుకుంటే తప్ప వెళ్ళనని భీష్మించుకుని కూర్చున్నాడు.

"నువ్వు మంచిపేరు తెచ్చుకుంటే, అదే నాకు గురుదక్షిణ!" అని శ్రీముఖుడతడికి ఎంతగానో చెప్పాడు. కాని, మహానందుడు అంగీకరించకపోవడంతో, శ్రీముఖుడు తన కొడుకు గురించి చెప్పి, వాణ్ణి బాగుచేయమన్నాడు.

మహానందుడు, చతుర్ముఖుణ్ణి పిలిచి మాట్లాడాడు. తర్వాత వాణ్ణి మంచిమార్గాన పెట్టేందుకు కొన్ని ప్రయత్నాలు చేసి

"వసుంధర"



విఫలమయ్యాక, మహానందుడు తన తపోబలంతో, ఒక రాగికడియాన్ని సృష్టించి చతుర్ముఖుడి చేతికి తొడిగి, "నాయనా! ఇది ధరించినప్పుడు పాండిత్యంలోనూ, సత్ప్రవర్తనలోనూ నీకు సాటిరాగలవారుండరు. ఈ రాగి కడియం నీకొక్కడికి మాత్రమే ఉపయోగిస్తుంది. రోజూ స్నానం చేసే ముందు, ఈ కడియాన్ని బయటకుతీసి శుభ్రంగా తోమి, స్నానం పూర్తయ్యాక మళ్ళీ ధరిస్తూండు. నీకు తప్పక మేలు జరుగుతుంది," అని చెప్పాడు.

ఆరోజునుంచీ చతుర్ముఖుడిలో గొప్ప మార్పు వచ్చింది. ఎంతో వినయంగా, మర్యాదగా ప్రవర్తిస్తూ, అతడు తన పాండిత్యాన్ని ప్రదర్శించసాగాడు. శ్రీముఖుడు కొడుకును పరీక్షించి, వాడిప్పుడు పాండిత్యంలో తనను మించినవాడయ్యాడని గ్రహించాడు.

ఆయన తన శిష్యుడైన మహానందుడితో, "నీ గురుదక్షిణ అపూర్వమైనది! ఇప్పుడు నేనే నీకు ఋణపడి వున్నాను," అని మెచ్చుకున్నాడు.

మహానందుడు గురువు పాదాలకు నమస్కరించి సంతోషంగా వెళ్ళిపోయాడు.

ఒకనాడు శ్రీముఖుడు కొడుకుతో, "నాయనా! ఈ గ్రామంలో నీ విద్య వృథా కాకూడదు. రాజధానికి వెళ్ళి ప్రఖ్యాత పండితుల ముందు నీ పాండిత్యాన్ని ప్రదర్శించి, నీ జీవితాన్ని సార్థకం చేసుకునిరా," అన్నాడు.

చతుర్ముఖుడు సరేనని రాజధానికి వెళ్ళాడు. అయితే, అతడికి రాజదర్శనం లభించలేదు. పాండిత్యాన్ని ప్రదర్శించడానికైతే ముందుగా అతడు, విద్యాధరుడనే రాజాస్థాన పండితుణ్ణి మెప్పించవలసి వుంటుందని ఎవరో చెప్పారు. చతుర్ముఖుడు, విద్యాధరుణ్ణి చూడబోతే, ఆయన అతడికేసి నిరసనగా చూసి వెళ్ళమన్నాడు.

చతుర్ముఖుడికి విసుగు పుట్టింది. తన గ్రామానికి వెళ్ళిపోవాలనుకున్నాడు కానీ,



తండ్రి చెప్పిన పని పూర్తి చేయకుండా వెళితే, ఆయన బాధపడతాడని సంకోచించాడు.

కొద్ది రోజులకు చతుర్ముఖుడు వెంట తెచ్చుకున్న డబ్బు అయిపోయింది. ఏం చేయాలో తోచక అతడు తాను బసచేసిన సత్రంయజమానినికలుసుకుని, "అయ్యా, నావద్ద డబ్బయిపోయింది. ఇంతవరకూ నాకు రాజదర్శనం లభించలేదు. రాజదర్శనం దొరికేదాకా తమరిక్కడ సన్నుండనిస్తే, ప్రతిఫలంగా నేను తమకు ప్రతిరోజూ గీతాసారాన్ని వివరించగలను," అన్నాడు.

ఏ కళనున్నాడోగాని సత్రం యజమాని ఇందుకు అంగీకరించాడు. ఆరోజు నుంచీ చతుర్ముఖుడు సత్రం యజమానికి భగవద్గీతలోని శ్లోకాలకు వివరణ చెప్పసాగాడు. అతడు చెబుతూంటే, సత్రం యజమానికి భగవద్గీతపట్ల ఎంతో ఆసక్తి కలగసాగింది.

ఒకరోజున రాజు రాజధానిలోని సత్రం యజమానులు పదిమందికీ కబురుచేసి, వాళ్ళతో, "మీరందరూ ఎంతో చక్కగా, సమర్థవంతంగా సత్రాలను నిర్వహిస్తున్నారు. అదెలా చేయగలుగుతున్నారో చెబితే, నేనూ నా కొలువులో ఆ పద్ధతులు ప్రవేశపెడదామనుకుంటున్నాను," అన్నాడు.

దీనికి మిగతా సత్రం యజమానులందరూ, తలోరకంగా ప్రగల్భాలు పలికి బదులిస్తే, చతుర్ముఖుడున్న సత్రం యజమాని మాత్రం వినయంగా, "ప్రభూ! సాధారణంగా సత్రం నిర్వహించడానికి ఏ నియమాలుంటాయో అవే నేనూ పాటిస్తున్నాను. అటుపైన అంతా భగవత్కృప," అని సమాధానం యిచ్చాడు.

రాజు ఆశ్చర్యపడి, "భగవత్కృప అంటున్నావు. నీకు స్వయంకృషి మీద నమ్మకం లేదా?" అని అడిగాడు.

"ప్రభూ! స్వయంకృషి చేయడం వరకూ నాకు నమ్మకమున్నది. ఫలితం గొప్పతనం మటుకు నాదికాదంటున్నాను.



అని అంగీకరించాడు. నేనెంతవాణ్ణి?''
అన్నాడు సత్రం యజమాని.

దీనికి రాజు మరింతగా అబ్బురపడి, ''నా రాజ్యంలో సామాన్యుల్లో ఇంత జ్ఞానం కలవారున్నారని, నాకు తెలియదు. రేపు నా కొలువులో నిన్ను ప్రత్యేకంగా సన్మానిస్తాను,'' అన్నాడు.

''ప్రభూ! నేను సన్మానానికి తగను. నాలో ఈ జ్ఞానం కలిగించిన మహా పండితుడొకాయన ఎక్కడినుంచో వచ్చి, తమ దర్శనం కోసం ఎదురుచూస్తున్నాడు. ఆయన కోరిక తీర్చండి,'' అన్నాడు సత్రం యజమాని.

రైతు కష్టపడి పొలం దున్ని పంట పండించాలంటే, సకాలంలో వానలు పడాలికదా! వానలేకపోతే స్వయంకృషి వృథా అవుతుంది. స్వయంకృషి లేనిదే వాన పడినందువల్ల మాత్రం పంటలు పండవు. కాబట్టి గొప్పతనం స్వయంకృషిలోనూ, భగవత్కృపలోనూ కూడా వున్నది,'' అన్నాడు సత్రం యజమాని.

''స్వయంకృషి చేశాక మంచి ఫలితాలు వస్తే, మనిషికి గొప్పవాడిననిపించుకోవాలని వుంటుంది. నీకలాంటి కోరికలేదా?'' అని ప్రశ్నించాడు రాజు.

''ప్రభూ! మహావీరుడయిన అర్జునుడే, తన విజయానికి కారణం శ్రీకృష్ణుడే

మర్నాడు చతుర్ముఖుణ్ణి తన కొలువుకు తీసుకురమ్మని, రాజు సత్రంయజమానికి చెప్పాడు.

సత్రంయజమాని తిరిగి వెళ్ళి జరిగినదంతా చతుర్ముఖుడికి చెప్పాడు. చతుర్ముఖుడు అతడికి కృతజ్ఞతలు తెలుపుకుని, మర్నాడు రాజుకొలువుకు వెళ్ళాడు. అక్కడ ఆయన పురాణాలకు వ్యాఖ్యానం చెబుతూంటే, ఆస్థానపండితులందరూ అబ్బురపాటుతో విన్నారు.

రాజు చతుర్ముఖుణ్ణి మెచ్చుకుని, ''మీరు మహాపండితులు. నా కొలువుకు రావడానికి తమరు, మా ఆస్థానపండితుడైన విద్యాధరుణ్ణి కలుసుకుని వుంటే,

ఎప్పుడో మీ గొప్పతనం నాదాకా చేరి వుండేది," అన్నాడు.

విద్యాధరుడు తనను నిరసించి పంపి వేసిన సంగతి, చతుర్ముఖుడు అప్పుడు రాజుకు చెప్పాడు.

ఇది విని రాజు కోపంపట్టలేక, "మహాను భావా! ఇది నా కొలువుకే ఘోరావమానం. ఈ తప్పుకు తమరే స్వయంగా విద్యా ధరుణ్ణి శిక్షిస్తే తప్ప, నా మనసు శాంతిం చదు." అన్నాడు.



చతుర్ముఖుడు ఇందుకు అంగీకార సూచకంగా తలాడించి, తన చేతికున్న రాగికడియాన్ని తీసి మహారాజుకిచ్చి, విద్యాధరుడివద్దకు వెళ్ళి, అతణ్ణి నానావిధ దుర్భాషలతో నిందించాడు. ఆ సమ యంలో అతడి ప్రవర్తన పండితుడికిలా కాక, పామరుడికిలా అతి నీచంగా వుండ డంతో, రాజే ఆశ్చర్యపడ్డాడు. విద్యాధరు డేమీ అనలేక ఖిన్నుడై తలవంచుకున్నాడు.

తర్వాత చతుర్ముఖుడు, రాజు నుంచి రాగికడియాన్ని తీసుకుని తిరిగి ధరిం చాడు. అప్పుడు రాజు, చతుర్ముఖుడితో, "అయ్యా! మహాపండితులూ, అఖండ జ్ఞాన సంపన్నులూ అయిన తమరు, నేనొక చిన్న అవకాశం యిచ్చేసరికి విద్యాధరుణ్ణి అతి నీచంగా నిందించారు. మీ ప్రవర్తన ఈ కొలువుకే తలవంపుగా వున్నప్పటికీ, అందులో ఏదో పరమార్థమున్నదని భావి స్తున్నాను. అది సెలవిచ్చి మమ్ములను ధన్యుల్ని చేయండి," అన్నాడు.

చతుర్ముఖుడు మందహాసం చేసి, "నా ప్రవర్తనకు నేను సిగ్గుపడుతున్నాను. ప్రభువులు నన్ను మన్నించాలి. నా పాండిత్యం నా గొప్పతనంకాదు. అంతా ఈ రాగికడియంలో వున్నది." అంటూ తన కథ చెప్పాడు.

రాజు ఆ కథ విని మరింత ఆశ్చర్యపడి, "పండితవర్యా! తమరు రాగికడియం ధరించి, విద్యాధరుణ్ణి శిక్షించడానికి వెళ్ళ వలసింది. అలా కాక రాగికడియాన్ని నాకిచ్చి, విద్యాధరుణ్ణి పండితుడికి తగని

మాటలతో నిందించారు. అది ఉచితమని తమకు తోచిందా? ఒక సామాన్య సత్రం యజమానిలో ఉత్తమ సంస్కారాన్ని ప్రవేశపెట్టగలిగిన తమరిలో, ఇంత ద్వేషమా? నేను విద్యాధరుణ్ణి శిక్షించమన్నప్పుడు, తమరు రాగికడియాన్ని ధరించే వున్నారు. ఏమి చేయాలో తమకప్పుడుస్ఫురించేవుండాలికదా!" అన్నాడు.

ఇందుకు చతుర్ముఖుడునవ్వి, "ప్రభూ! విద్య, పాండిత్యం లేనప్పుడు నేనెలా వుంటానో, తమరు ప్రత్యక్షంగా చూశారు. స్వయంగా సాధించలేని పాండిత్యం, రాగి కడియం మూలంగా నాకు అబ్బింది. ఆ పాండిత్యం నా ప్రవర్తనను కూడా మార్చి సంస్కారవంతుణ్ణి చేసిందని నేననుకుంటున్నాను. కానీ, పాండిత్యంతోపాటు సంస్కారం అబ్బదని విద్యాధరుడు ఋజువు చేశాడు. ఒకప్పుడు ఆయన నన్ను పరీక్షించనైనా పరీక్షించకుండా నిరసించిపంపాడు. నేను రాగి కడియాన్ని తీసి పక్కనపెట్టినట్టుగా, ఆయన కూడా తన పాండిత్యాన్ని పక్కనపెట్టి నన్ను నిరసించాడు. ఆ బాధ ఎలా వుంటుం ఆయనకు తెలియజెప్పాలనే, నేను రా కడియం తీసి పక్కనపెట్టి, ఆయనన శిక్షించడానికి వెళ్ళాను. తమరు చెప్పినట్టు నేను రాగికడియాన్ని ఎల్లవేళలా ధరించడమే ఉచితమూ, ఉత్తమమూ అవుతుంది! అదేవిధంగా ప్రతిపండితుడూ అన్ని సమయాల్లోనూ తన పాండిత్యానికి తగ్గ విధ గానే ప్రవర్తించడం ఉచితం. రాగద్వేషలకూ, అసూయాహంకారాలకూ లో నప్పుడు కూడా, పండితుడు తనలో పాండిత్యాన్ని రాగికడియంలా తననుం వేరు చేయరాదని హెచ్చరించడానికే నేనాపని చేశాను. నాకు విద్యాధరుడి ఏమీ ద్వేషభావం లేదు," అన్నాడు.

చతుర్ముఖుడి భావం రాజుకూ, విద్యాధరుడికే కాక, అక్కడి సభలోని వారందరికీ కూడా అర్థమయింది. రాజు చతుర్ముఖుణ్ణి ఆస్థానపండితుడిగా నియమించి గౌరవించాడు.






## 11

[వీరసింహుడు కొత్త సైన్యాన్ని సమీకరించడానికి పూనుకుని, ప్రజలనుంచి బలవంతంగా ధాన్యం వసూలుచేసి, ఆ ధాన్యంతో, చంద్రపురి నుంచి ఆయుధాలు కొనుగోలు చేయమని తమ అనుచరులను ఆజ్ఞాపించాడు. అయితే, అందుకు ప్రజలు ఎదురుతిరిగారు. వసంతుడి నాయకత్వంలో యువకులు కొందరు ప్రజారక్షణకు బద్ధకంకణులయ్యారు. —తరవాత]

ఒకనాటి మధ్యాహ్నం జయానందముని చెట్టుకింద విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు, ఆయన శిష్యుడు గోవిందుడు అక్కడికి వచ్చి, "గురువర్యా, ఒక ముసుగువ్యక్తి తరచూ మన ఆశ్రమసమీపంలో తిరుగుతూ, సెలయేటి నీళ్ళు తాగుతూ, గుహలకేసి పరిశీలనగా చూస్తున్నాడు. నిన్న సాయంకాలం అతన్ని నేను మూడవసారి చూశాను," అన్నాడు.

"అవును, దూరం నుంచి నేనూ ఆయనను చూశాను. ఆయనెవరో గొప్పవాడై వుంటాడనీ, ఏదో మహత్తరకార్యం కోసమే ఇలా వస్తున్నాడనీ నాకనిపిస్తున్నది. ఇంకొకసారి కనిపించాడంటే నాతోచెప్పు, ఆయనతో మాట్లాడాలి," అన్నాడు జయానందముని.

కొన్నాళ్ళు గడిచింది. ఒకనాటి సాయంకాలం సందీపుడు పులిపిల్లలతో ఆడుకుంటున్నాడు. సందీపుడు పులిపిల్లలతో



"నేనీ ప్రాంతంలో తిరగడం మూడో కంటికి తెలియదనుకున్నాను. అయినా, మీరు పసికట్టడం చాలా ఆశ్చర్యకరం!" అన్నాడు ముసుగువ్యక్తి.

"నీ ఉనికి వీరసింహుడి భటులకు తెలిసిపోతుందని నువ్వేమాత్రం సందేహించనవసరం లేదు. ఎందుకంటే ఈ ప్రాంతంలో కొత్తవారెవరయినా అడుగు పెడితే ఆ క్షణమే మాకు తెలిసిపోతుంది!" అన్నాడు ముని.

ముసుగువ్యక్తి మునిని పరిశీలనగా చూసి, "తమరు జయానందమునులే కదా! మీకిదే నా నమస్కారం," అన్నాడు.

ముని మందహాసం చేశాడు.

ముసుగువ్యక్తి ముని పాదాలు తాకి, "మహాత్మా, మిమ్మల్ని గురించి, నా మిత్రుడు జయపురి రాజు శంకరవర్మ ద్వారా చాలా విన్నాను. అయినా, వీరసింహుడి చారుల గురించి తమకు తెలియచేసే వారెవ్వరు? అలాంటి జాగరూకతవహించడానికి కావలసినంత మంది మనుషులు ఇక్కడ ఎవరూ కనిపించడం లేదే!" అన్నాడు.

"సహాయం చేయడానికి మనుషులు తప్ప మరెవ్వరూ వుండరని నీ అభిప్రాయమా?" అని అడిగాడు ముని నవ్వుతూ.

కుస్తీపట్టడం చూసి పక్కనే వున్న భల్లూకి ఆనందంతో గంతులు వేయసాగింది. ఒక ముసుగువ్యక్తి బండచాటునుంచి ఆ విచిత్ర దృశ్యాన్ని చూస్తూ నిలబడ్డాడు.

జయానందముని ఆ వ్యక్తిని సమీపించి, "స్వాగతం," అన్నాడు.

ముసుగువ్యక్తి ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూసి, మరుక్షణమే తేరుకుని చేతులెత్తి మునికి నమస్కరించాడు.

"నువ్వు దేనినో వెదుకుతూ, తరచూ ఈ అరణ్యప్రాంతంలో తిరుగుతున్నావు కదా! ఆ వెదికేదేదో చెబితే, మేమేమైనా సహాయం చేయగలమేమో ఆలోచిస్తాం!" అన్నాడు ముని చిన్నగా నవ్వుతూ.

ఆ మాటలకు ముసుగువ్యక్తి మరింత ఆశ్చర్యపోతూ, "అంటే, మీకు అతీత శక్తులున్నాయన్నమాట!" అన్నాడు.

"ఆ మాత్రానికి అతీత శక్తులు ఎందుకు నాయనా! వాటిని సాధించడంకన్నా, మనతోపాటు, సహజీవనం సాగించే ఇతర ప్రాణులతో స్నేహం చేయడం సులభం కదా!" అన్నాడు ముని.

ముని మాటలకు ముసుగువ్యక్తి ముఖం సంతోషంతో వికసించింది.

"పులులతోనూ, ఎలుగుబంటితోనూ, ఆ పసివాడు ఎలా ఆడుకోగలుగుతున్నాడో ఇప్పుడు నా కర్థమయింది మహాత్మా! అవునూ, ఇంతకూ ఆ కుర్రవాడెవరు?" అని అడిగాడు ముసుగువ్యక్తి.

"నువ్వు అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే మొదట నువ్వెవరో నాకు తెలియాలి," అన్నాడు ముని.

ముసుగువ్యక్తి, ఒక్క క్షణం మౌనం వహించి, "మహాత్మా, నేను మిమ్మల్ని నమ్ముతున్నాను," అంటూ ముఖానికి వున్న ముసుగును తొలగించాడు.

ముని ప్రశాంతంగా నవ్వుతూ, "మహారాజా, ఆ పసివాడు వేరెవరో కాదు, నీ కుమారుడే! నిన్ను ఎప్పుడో ఒక్కసారే చూశాను. అయినా, యువరాజు రూపాన్ని బట్టే నిన్ను పోల్చుకోగలిగాను!" అన్నాడు.



రాజు శాంతిదేవుడు నివ్వెరపోయాడు. ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి!

"రాజా, నువ్వు ప్రాణాలతో ఉన్నట్టయితే, రాణిగారినీ, మీ కుమారుణ్ణీ వెదుక్కుంటూ, తప్పకుండా ఇక్కడికి రాగలవని నాకు తెలుసు. రాణిగారు యువరాజును నాకు అప్పగించి, కళ్ళు మూసింది. నువ్వు ప్రాణాలతో క్షేమంగా వున్నావని తెలిసివుంటే ఆమె మరింత సంతోషంగా తనువు చాలించి వుండేది. అయినా, జరిగిపోయినదానికి విలపించకుండా భవిష్యత్తును భగవంతుడికి అర్పించమన్న నా సలహాను, ఆమె పాటించి, ప్రశాంతంగా వెళ్ళిపోయింది!" అన్నాడు ముని.



''ఆ తరవాత?'' అని అడిగాడు రాజు, పెల్లుబుకుతూన్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

''ఆ తరవాత ఆమె భౌతికకాయాన్ని అక్కడ సమాధి చేశాం,"అంటూ దూరంగా వున్న ఒక బండరాతిని చూపాడు ముని.

ఆ బండ మీద రకరకాల పువ్వులు కనిపించాయి.

''ఊహ తెలిసిననాటి నుంచి, యువ రాజు రోజూ తప్పకుండా ప్రతి ఉదయం తన తల్లి సమాధి మీద పువ్వులుంచి పూజిస్తున్నాడు!'' అన్నాడు ముని.

రాజు ఆ పైన దుఃఖాన్ని ఆపుకోలేక, సమాధి దగ్గరికి వెళ్ళి రాతికి తల ఆన్చి, పసిబిడ్డలాగా విలపించసాగాడు. ముని ఆయనన్ను సమీపించి, దగ్గర కూర్చుని మంచి మాటలతో ఓదార్చాడు.

కొంతసేపయ్యాక రాజు, ''మహాత్మా, నేను నా బిడ్డను చూడవచ్చా?'' అని అడిగాడు వినయంగా.

''అది నీ ఇష్టం. నా కెటువంటి అభ్యం తరమూ లేదు,'' అన్నాడు ముని.

రాజు కొంతసేపు మౌనంగా ఆలో చించి, ''ఈ విషయంలో తమకేదో అసం తృప్తి ఉన్నట్టే తోస్తున్నది. మీరు మన స్ఫూర్తిగా అనుమతిస్తే తప్ప నేను నా బిడ్డను చూడను,'' అన్నాడు.

''రాజా, యువరాజు ప్రస్తుతం ప్రకృతి ఒడిలో ప్రశాంతంగా పెరుగుతూ, నా దగ్గర విద్య నభ్యసిస్తున్నాడు. అతడు అద్భుత మైన తెలివితేటలు గలవాడు. నిన్ను చూడ గానే తన తండ్రి అని గుర్తించగలడు. ఆపైన, జరిగిన సంగతులన్నీ బయటపడక తప్పదు. ధర్మబద్ధుడైన తన తండ్రి దుర్మార్గుల కుట్రకు బలి అయ్యాడన్న బాధ ఆ బిడ్డ మనసులో కలుగుతుంది. ఆ తరవాత, ఆ దుర్మార్గులపై పగసాధించా లన్న ఆగ్రహం ఆ పసిహృదయంలో ప్రజ్వలించవచ్చు. అది, అతని ప్రస్తుత ప్రశాంత జీవన విధానాన్నీ, విద్యావికా సాన్నీ దెబ్బతీయవచ్చునన్న అనుమానం కలుగుతున్నది,'' అన్నాడు ముని.



''మీరు నా బిడ్డను కంటికి రెప్పలా కాపాడుతున్నారు. పైగా మీరిచ్చే విద్యను నేను ఇవ్వలేను. అంతేకాదు. నా సమయాన్ని ఒక్క నా బిడ్డ యోగక్షేమాల కోసమే వెచ్చించే స్థితిలో నేను లేను. అంతకన్నా ముఖ్యమైన పనులు నెరవేర్చవలసిన బాధ్యత నా మీద ఉన్నది!'' అన్నాడు రాజు.

''ఏమిటా గురుతరబాధ్యత?'' అని ప్రశ్నించాడు ముని.

''మహాత్మా, ప్రస్తుతం సుమేధ రాజ్యంలో నెలకొన్న పరిస్థితుల గురించి మీకు తెలుసో లేదో నాకు తెలియదు. నన్నూ, రాణినీ, మా బిడ్డనూ హతమార్చాలని వీరసింహుడు కుట్రపన్నాడు. నా భార్యాపిల్లల గతి ఏమయిందో, అసలు నేను ప్రాణాలతో వున్నానో లేదో కూడా వీరసింహుడికి తెలియదు. నిజానికి నేను వాణ్ణి వెంటాడుతూనే వున్నాను. అందువల్ల వాడు మనశ్శాంతిని కోల్పోయాడు. ఆందోళనతో ఆగ్రహానికి లోనయ్యాడు. ఆ ఆగ్రహాన్ని అన్నెం పున్నెం ఎరుగని అమాయక ప్రజలను వేధించడంలో చూపుతున్నాడు. పొరుగు రాజ్యాలపై దండెత్తి, అక్కడి సంపదలను దోచుకుని పంచుకుందామని దళనాయకులకు ఆశ చూపాడు. మా మామగారి రాజ్యమయిన

''నిజమే మహాత్మా, మీరన్నది అక్షరాలా నిజం!'' అన్నాడు రాజు.

''అయితే, ఇప్పుడు కాకపోయినా యువరాజుకు మునుముందు విషయం తెలియకపోదు. అప్పుడు అతడు తన ఇష్టానుసారం కర్తవ్యాన్ని నిర్వహించగలడు. అయితే, అందుకు ఇంకా కొంత కాలం గడవాలన్నది నా అభిప్రాయం!'' అన్నాడు ముని.

''అదీ నిజమే. పైగా, నా కుమారుడిపై నేను బంధం పెంచుకోవడం మంచిది కాదు,'' అన్నాడు రాజు.

''ఎందుకలా అంటున్నావు?'' అని అడిగాడు ముని.

అమృతపురి మీదికి దండెత్తాడు. కాని అదృష్టవశాత్తు సుమతీనదిలో హఠాత్తుగా వెల్లువరావడంతో వీరసింహుడి సేనలూ, ఆయుధాలూ కొట్టుకుపోయాయి. ఆ పైన కొత్తగా సైన్యాన్ని సమీకరించడానికి ప్రజలనుంచి, ధాన్యం దోచుకోవడం మొదలుపెట్టాడు. అయితే, వాడి దుష్కృత్యాలు కొనసాగకుండా అడ్డుపడడానికి నా శాయశక్తులా పాటుపడుతున్నాను,'' అన్నాడు రాజు.

ముని, ఆ మాటలకు సంతోషంగా తల వూపి, ''రాజా, సుమేధరాజ్యంలో జరుగుతూన్న అఘాయిత్యాలన్నీ నాకు తెలుసు. వీరసింహుడి భటుల ఆట కట్టించడానికి కొందరు యువకులు చేస్తూన్న ప్రయత్నాల గురించి కూడా విన్నాను. వీరసింహుడు, ఆ యువకులను హతమార్చాలన్న పట్టుదలతో ఉన్నట్టు కూడా తెలిసింది. ఏమాత్రం అవకాశం లభించినా, యువకులనూ వారి బంధుమిత్రులనూ నిర్దాక్షిణ్యంగా మట్టుపెట్టగల పరమ కిరాతకుడువాడు! అందువల్ల యువకులందరూ, కలిసికట్టుగా ఎంతో అప్రమత్తతతో ఒక పథకం ప్రకారం పోరాటం సాగించాలి. మొదట, వీరసింహుడు తన అరాచకాలను ఆపాలని హెచ్చరించి కొంత కాలం గడువిద్దాం. ఆ గడువులోపల వీరసింహుడు దారికి రాలేదంటే యుద్ధం తప్పదు. అయితే, ఆ యుద్ధం—వీరసింహుడి సేనలకూ, సాహసవంతులైన సుమేధరాజ్య యువకులకూ మధ్యమాత్రమే జరగాలి. అమాయకులయిన సామాన్యప్రజలను హింసించరాదు. వారికి ఇసుమంత కష్టం కూడా వాటిల్లకూడదు. ఏమంటావు?'' అని అడిగాడు ముని.

''అవును మహాత్మా!'' అన్నాడు రాజు.

''నువ్వు ఆ యువకులను ఒకటిగా సమీకరించి, సుమేధ రాజ్య సరిహద్దులో వున్న అరణ్యంలోకి నడిపించడం శ్రేయస్కరం!'' అన్నాడు ముని.

"మీ ఆజ్ఞను శిరసావహిస్తాను మహాత్మా," అన్నాడు రాజు. —(ఇంకావుంది)



# చెప్పుడుమాటలు

భీమయ్యా, సోమయ్యా చాలాకాలం నుంచి మంచి స్నేహితులు. ఉన్నట్టుండి వాళ్ళ మధ్య మాటలు నిలిచిపోయాయి. భీమయ్యమీద సోమయ్య, సోమయ్యమీద భీమయ్య ద్వేషం పెంచుకున్నారు.

ఒకసారి ఊరిబయట శివాలయందగ్గిర ఒకరికొకరు ఎదురయ్యారు. అప్పుడు భీమయ్య కలుగజేసుకుని, "ఇదిగో, సోమయ్యా! మనిషి అయ్యాక ముందూ, వెనకా ఆలోచించాలి. ఎవరు చెబితే వాళ్ళదే నిజమని గుడ్డిగా తల ఊపరాదు," అన్నాడు.

"నువ్వేం అంటున్నావే, నాకు అర్థంకావడం లేదు," అన్నాడు సోమయ్య.

"ఎలా అర్థమవుతుందిలే! చెడు కోరే వాళ్ళమాటలయితే, నీకు అర్థం అవుతాయి," అన్నాడు భీమయ్య.

"వివరంగా చెప్పాలిగాని, ఆ ఎత్తి పొడుపులెందుకు?" అన్నాడు సోమయ్య.

"అదే—ఆ చంద్రయ్య చెప్పుడుమాటలు విని, నామీద కక్ష పెంచుకున్నావట! నా అంతు చూస్తానని కూడా అన్నావట. ఎవరైనా గిట్టక ఏదైనా చెడుగా చెబితే, వెంటనే నమ్మడమేనా?" అని ప్రశ్నించాడు భీమయ్య.

"అవునూ! ఇంతకూ నేనలా నిన్ను అనరానిమాటలన్నానని, నువ్వెలా అనుకుంటున్నావు?" అని అడిగాడు సోమయ్య.

"ఆ కామయ్య చెప్పాడులే—అంతా!" అన్నాడు భీమయ్య.

"చెప్పుడు మాటలు వినరాదని నాకు చెబుతూ, చివరికి నువ్వు చేసిందేమిటి?" అంటూ నవ్వసాగాడు సోమయ్య.

భీమయ్యకు దానితో సంగతి అర్థమై, తనూ నవ్వసాగాడు.

—బి. రఘురామరాజు





# స్వప్నసుందరి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతి కొలిపే ఈ అర్ధరాత్రివేళ, నువ్వు దేనికోసం ఇంతగా అన్వేషిస్తున్నావో, నాకు తెలియదు. అయితే, ఏ నిధి నిక్షేపాల కోసమో, దేవలోకసుందరిలాంటి ఏ స్త్రీ కోసమో, నువ్వు ఇన్ని శ్రమలకు గురి అవుతుంటే మాత్రం, ఒక హెచ్చరిక చేయదలిచాను. కొందరి కోరికలు ఎంత ప్రయత్నించినా ఫలించవు. మరికొందరు ఫలించినవాటిని, ఆఖరిక్షణంలో తమ అవివేకం, తొందరపాటు, బుద్ధిమాంద్యాల కొద్దీ సద్వినియోగం చేసుకోలేరు. ఇందుకు ఉదాహరణగా, సుధీరుడనే ఒక రాజకుమారుడి కథ చెబుతాను. శ్రమ

**బేతాళ కథలు**



తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

పూర్వం మణిపురం అనే రాజ్యాన్ని, మాణిక్యవర్మ అనే రాజు పాలించేవాడు. ఆయనకు లేక లేక కలిగిన ఏకైక సంతానం సుధీరుడు. అతడికి ఇరవైఏళ్ళు నిండే సరికి, మాణిక్యవర్మ బాగా వృద్ధుడై పోయాడు. ఆయన తన కుమారుడికి వివాహం చేసి, రాజ్యభారం అప్పగించా లన్న నిర్ణయానికి వచ్చాడు. ఎందరో రాజకుమార్తెల గురించి, ఆయన వివరాలు తెలుసుకుని, చివరకు రత్నగిరి రాజ కుమార్తె అయిన రత్నప్రభ, సుధీరుడికి తగిన వధువుగా భావించాడు.

మాణిక్యవర్మ, రత్నప్రభ చిత్రపటాన్ని తెప్పించి, సుధీరుడికి ఆమెను గురించి చెప్పి, ''నాయనా, నేను వృద్ధుడినై పోయాను. ఇక ఈ రాజ్యభారం మోయడం, నావల్లకాదు. నువ్వు పరిపాలనా బాధ్యత స్వీకరించకతప్పదు,'' అన్నాడు.

సుధీరుడు తన వివాహ విషయం మర్నాడు చెబుతానని, తండ్రి నుంచి రత్నప్రభ చిత్రపటాన్ని తీసుకుని, తన మందిరానికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి సుధీరుడికి కలలో, ఒక అద్భుత సౌందర్యరాశి కనిపించింది. ఆమె దేహచ్ఛాయ మేలిమిబంగారం, కలువ రేకులవంటి కన్నులు, పొడవాటి కురులు, సంపెంగమొగ్గవంటి నాశిక! ఆమె కొద్ది సేపు సుధీరుడి కేసి నవ్వుతూ చూసి, అంతర్థానమైంది.

ఆ వెంటనే సుధీరుడికి మెలకువ వచ్చింది. ఇక ఆ రాత్రి అంతా అతడికి నిద్రపట్టలేదు. అటువంటి సౌందర్యరాశి ఎక్కడో ఒకచోట తప్పక వుండి తీరుతుందనీ, వివాహమాడదలిస్తే, ఆమెనే వివాహమాడాలనీ అతడు నిశ్చయించుకున్నాడు.

మర్నాడు సుధీరుడు, తండ్రితో, ''నేను కొంతకాలం ఒంటరిగా దేశసంచారం చేసి,



ప్రజలస్థితిగతులెలా వున్నవో తెలుసుకోవాలనుకుంటున్నాను. రాజుగా పట్టాభిషిక్తుడినయ్యేముందు, ఇలాంటి అనుభవం చాలా అవసరం అని నా అభిప్రాయం. నేను తిరిగి వచ్చాక వివాహం జరిపించండి,'' అన్నాడు.

ఇందుకు మాణిక్యవర్మ అంగీకరించాడు. ఆ మర్నాడే సుధీరుడు సామాన్య పౌరుడిలా దుస్తులు ధరించి, గుర్రం మీద దేశం నలుమూలలూ, తన స్వప్నసుందరి కోసం వెదికేందుకు ఉత్సాహంతో బయలు దేరాడు.

ఆ విధంగా సుధీరుడు మూడు నెలల పాటు ఎన్నో ప్రాంతాలు తిరిగాడు. తను బసచేసిన సత్రం యజమానుల్నీ, వర్తకపు పనులమీద వివిధ ప్రదేశాలు తిరిగే వాళ్ళనూ, 'ఏదో మాటల సందర్భంలో అడిగినట్టుగా, తనకు కలలో కనిపించిన సుందరిలాంటి స్త్రీని చూశారా, అని అడిగి చూశాడు. ఎవరూ అలాంటి సుందరిని చూడకపోవడమే కాక, విని కూడా వుండ లేదని చెప్పారు.

సుధీరుడు మరి రెండు నెలలపాటు ఎన్నో గ్రామాలూ, పట్టణాలూ తన స్వప్న సుందరి కోసం తిరిగి తిరిగి, చివరకు విసిగిపోయాడు. సరైనవేళలో భోజనం చేయనందువల్లా, ఎండనకా, వాననకా ప్రయాణం సాగించడంవల్లా, అతడి దేహం కొంత శుష్కించి రూపమే మారి పోయింది.

ఇలాంటి స్థితిలో, ఒకనాటి మిట్ట మధ్యాహ్నం వేళ, సుధీరుడు ఒక నదీ తీరం చేరి, గుర్రాన్ని మేతకై వదిలి, దాపులనున్న ఒక చెట్టు నీడలో విశ్రమించాడు. బాగా అలసిపోయి వున్నందున, నదిపైనుంచి వచ్చే చల్లనిగాలికి వెంటనే అతడికి నిద్రపట్టింది. తిరిగి అతడికి మెలుకువ వచ్చేసరికి సూర్యాస్తమయం కాబోతున్నది.

ఆసరికి గుర్రం గడ్డిమేస్తూ ఎటో వెళ్ళి పోయింది. సుధీరుడు దాన్ని వెదుకుతూ



నదీతీరం వెంట బయలుదేరాడు. ఒక చోట అతడికి నదిలో గాలంవేసి, ఒడ్డున కదలామెదలక కూర్చుని వున్న ఒక పిల్ల కనిపించింది.

సుధీరుడు ఆమెను సమీపించి, "గుర్రం ఒకటి ఇటుగా పోవడం, ఏమైనా చూశావా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే ఆమె ఉలిక్కిపడి వెనుదిరిగి చూసింది. సుధీరుడికి కలిగిన ఆశ్చర్యం, ఆనందం అంతా యింతా కాదు. ఆమె తనకు కలలో కనిపించిన అందాలరాశి, తన స్వప్నసుందరి!

"ఆహాఁ, నా అన్వేషణ ఫలించింది. కలలో కనిపించిన సుందరివి నువ్వే! నీకోసం ఎంతో కాలంగా ఎండనక, వాననక దేశం నలుమూలలూ గాలిస్తున్నాను. నా వెంటరా. నిన్ను వివాహమాడతాను," అన్నాడు ఉద్వేగంగా.

ఆ మాటలు వింటూనే చేపలు పడుతున్న పిల్ల, అతడికేసి బెదురుచూపులు చూసి, గాలాన్ని అక్కడే వదిలి దూరంగా వున్న గుడిసెలకేసి పరిగెత్తింది.

సుధీరుడు ఆమె వెళ్ళిన దిక్కుగా బయలుదేరాడు.

అతడు గుడిసెలను సమీపించేసరికి, ఒక గుడిసెలోంచి వృద్ధుడొకడు బయిటికి వచ్చి, సుధీరుణ్ణి నఖశిఖపర్యంతం ఒకసారి పరీక్షగా చూసి, "ఎవరు నువ్వు? ఏ ఊరివాడివి? నీ తల్లిదండ్రుల పేరేమిటి? కలలో కనిపించావు పెళ్ళి చేసుకుంటానంటూ, నా కూతురు వెంట పడ్డావట! ఇది మర్యాదనిపించుకుంటుందా? అసలు నీ పేరేమిటి?" అని తీవ్ర స్వరంతో అడిగాడు.

వృద్ధుడు ఇలా అనగానే సుధీరుడు, ఒక క్షణకాలం దిగ్భ్రాంతుడైపోయి, తర్వాత తేరుకుని, బొంగురుపోయిన స్వరంతో, "అయ్యా, మీ ప్రశ్నలన్నిటికీ, నేనివ్వగల జవాబు ఒకటే—నేనొక మూర్ఖుణ్ణి!" అని వెనుదిరిగి, రాజధానీ నగరం చేరి, రత్నప్రభను వివాహమాడి,

చాలాకాలం పాటు ప్రజారంజకంగా రాజ్యపాలన చేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సుధీరుడు ఎన్నో శ్రమలకోర్చి, తనకు కలలో కనిపించిన సుందరిని చూడగలిగాడు. అయినా, అతడు తాను యువరాజునని వృద్ధుడికి చెప్పి, ఆమెను తన వెంట తీసుకుపోక, మూర్ఖుణ్ణని చెప్పి ఎందుకు వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకున్నాడు. ఇందుకు కారణం నిజంగా మూర్ఖత్వం, బుద్ధిమాంద్యమా లేక మరేమైనా వున్నదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సుధీరుడు మూర్ఖుడూ, బుద్ధిమందగించినవాడూ కాదు. అట్లని అతడు వివేకి, జ్ఞానవంతుడూ కూడా కాదు. కలలో కనిపించిన ఒక సుందరి కోసం, వాస్తవ ప్రపంచంలో వెతకబూనడం అవివేకం. అయితే, ఆ నిజాన్ని వృద్ధుడు ప్రశ్నించే వరకూ, అతడు గుర్తించలేకపోయాడు. వృద్ధుడడిగిన ప్రశ్నలతీరు, సుధీరుడిలో వివేకోదయానికి కారణమైంది. ఒక సామాన్య పేద, తన కుమార్తెను వివాహమాడవచ్చినవాణ్ణి, అతడు తగిన వరుడో కాదో తెలుసుకునేందుకు ఎన్నో వివరాలు అడిగాడు. అలాంటి స్థితిలో, తాను, యువరాజై వుండీ, కాబోయే రాణికి ఎలాంటి అర్హతలు వుండాలో ఆలోచించక, కేవలం కలలో కనిపించిన అందచందాలు చూసి, భార్యగా తెచ్చుకోవాలనుకున్నాడు. ఇది మూర్ఖత్వం. ఇంతకు మించిన మూర్ఖత్వం మరి వుండదు. అది గుర్తించే సుధీరుడు, స్వప్నసుందరి తండ్రికి తాను ఎవరైనదీ తెలియపరచకుండా కేవలం మూర్ఖుణ్ణని చెప్పి, రాజధానికి తిరిగి వచ్చాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: మాచిరాజు కామేశ్వరరావు రచన]





# కంకణ బహూకరణ

మవిలయావతీనగరంలో, బాటసారుల సౌకర్యంకోసం, ఒక పెద్ద సత్రం వున్నది. రోజూ రాజధానికి వచ్చేపోయే వాళ్ళతో, సత్రం కిటకిటలాడుతూండేది.

ఒకసారి దూర గ్రామంనుంచి వచ్చి సత్రంలో బసచేసిన, వీరభద్రుడనే ధనికుడి బంగారు కంకణం పోయింది. ఆయన గగ్గోలు పెడుతూ సత్రం యజమానికి ఫిర్యాదు చేశాడు. సత్రం యజమాని, ధనవంతుడి గదిని పరిశీలించి, అక్కడ అవసరం అయిన ఏర్పాట్లు చేసే నౌకరు అప్పలసూరి అని తెలుసుకుని, వాణ్ణి పిలిపించి, కంకణం గురించి అడిగాడు.

అప్పలసూరి విపరీతంగా ఆశ్చర్యపోతూ, "అయ్యా, ఆ కంకణం సంగతి నాకేమీ తెలియదు," అన్నాడు.

వాడి దుస్తులనూ, వాడుండే గదిలోని వస్తువులనూ వెతికినా ప్రయోజనం లేకపోయింది. చేసేదిలేక సత్రంయజమాని రాజభటులకు కబురుచేసి, అప్పలసూరిని బంధించమన్నాడు. భటులు వాణ్ణి బంధించి, రాజసభకు తీసుకుపోయారు.

రాజు భటులద్వారా విషయం తెలుసుకుని, కొద్దిసేపు ఆలోచించాడు. ఇలాంటి విషయాల్లో నిందితుడు దోషి అయినదీ, నిర్దోషిఅయినదీ, నిందుతుడికి తప్ప ఇతరులకు తెలిసే ఆస్కారముండదు. అయితే—ధనికుడి గదిలో సౌకర్యాలూ అవీ చూడడానికి, నౌకరు అప్పలసూరి తప్ప మరెవరూ వెళ్ళరు. అందువల్ల, బంగారు కంకణాన్ని వాడే దొంగిలించి వుండాలి. అలా కానప్పుడు ధనికుడు వీరభద్రుడే కంకణం పోయిందని అబద్ధపు ఫిర్యాదు చేసివుండాలి!

రాజు ఇలా ఆలోచించాక, ఆయనకు మరొక అనుమానంవచ్చింది. ఏదో పనిమీద

నగరానికి వచ్చిన ఒక పెద్దమనిషి, అప్పల సూరి లాంటి నౌకరు మీద అబద్ధపు ఫిర్యాదు చేయవలసిన అవసరంవుండదు. కాబట్టి, నూటికి నూరుపాళ్ళు దొంగ అప్పలసూరే. అయితే, ఇతరసాక్ష్యాలేమీ లేవు గనక, చేసిన నేరాన్ని వాడిద్వారానే బయటపెట్టించాలి!

ఇలాంటి నిర్ణయానికి వచ్చిన రాజు, అప్పలసూరితో, "ఒరే, ధగధగమెరుస్తున్న బంగారు కంకణం కంటబడగానే, ఏదో కక్కుర్తి పడి నువ్వు దాన్ని అపహరించి వుంటావు. నీకు నేను పదిక్షణాల గడువు యిస్తున్నాను. ఈలోగా నేరం నువ్వు ఒప్పు కుంటే క్షమించి వదిలేస్తాను," అన్నాడు.

అప్పలసూరి ఏమాత్రం తొట్రుపడ కుండా నిర్భయంగా, తనకేమీ తెలియ దన్నాడు.

ఈ జవాబు విన్న రాజు, తన ఆస్థాన విదూషకుడైన ధరహాసుడికేసి చూశాడు. ధరహాసుడు తన వాక్చాతుర్యంతో ఎలాగైనా, నౌకరు చేత నేరం బయట పెట్టించగలడని, ఆయన నమ్మకం.

ధరహాసుడు, అప్పలసూరినిసమీపించి, "వీరభద్రుడనే ఆ ధనికుడు సత్రంలో ఎప్పుడు దిగాడు?" అని ప్రశ్నించాడు.

"అయ్యా, ఇప్పటికి మూడు రోజుల కిందట," అన్నాడు అప్పలసూరి.



"ఆయన ధరించిన బంగారు కంకణం ఎలా వుంటుంది?" అన్నాడు ధరహాసుడు.

"ఆ సంగతి నాకు తెలియదు," అన్నాడు అప్పలసూరి.

ధరహాసుడు కొంచెంసేపు ఆలోచించి, "ఆ గదిలోకి నువ్వు తప్ప, మరే సత్రం నౌకరూ వెళ్ళే అవకాశం లేదు కదా, ఏమంటావు?" అని అడిగాడు.

"చిత్తం!" అన్నాడు అప్పలసూరి.

"సరే. ఆ ధనికుడు కంకణాన్ని ఎల్ల వేళలా చేతికే ధరించేవాడా, లేక భోజన నిద్రా సమయాల్లాంటప్పుడు, చేతినుంచి తీసి ఎక్కడైనా పెట్టేవాడా?" అని అడిగాడు ధరహాసుడు.

అప్పలసూరి వెంటనే, "అయ్యా, క్షమించాలి! నేనసలు ఆ కంకణం ఎలా వుంటుందో కూడా ఎరగను," అన్నాడు.

ధరహాసుడు, వాణ్ణి అనేక రకాలుగా ప్రశ్నించి చూశాడు. కాని లాభంలేక పోయింది. చివరకు అతడు రాజుతో, "ప్రభూ, ఈ నౌకరు నిర్దోషి. ఎందువల్ల నంటే, తప్పు చేసినవాడు ఎంతటి నిబ్బరం కలవాడయినా, మనసులో ఏ మూలనో కొంచెం తడబాటువుండి, కంగారుపడి దొరికిపోతాడు. అప్పలసూరిలో అలాంటి దేమీ లేదు కాబట్టి, నిర్దోషి!" అన్నాడు.

విదూషకుడి మాటలకు రాజు చిరునవ్వు నవ్వి, "వీడు గొప్ప నటుడై వుండి, తను చేసిన నేరం బయటపడకుండా నటిస్తూండవచ్చుగదా!" అన్నాడు.

"అవును, ప్రభూ! పిడికెడు ఉప్పు రాళ్ళను నోట్లో వేసుకుని, అచ్చం బెల్లం ముక్కలు నములుతున్నట్టుగా భ్రాంతి కలిగించేవాడి నటన, ఎన్ని సన్మానాలకైనా అర్హమవుతుంది. ఈ అప్పలసూరి దోషి అయివుంటే—ఇంతటి మహానటుడు మన ఆస్థానంలో వుండడం, మనకు గర్వ కారణం. మరొక కంకణం చేయించి, తమచేతనే వీడికి బహుమానంగా ఇప్పించ దలిచాను," అన్నాడు విదూషకుడు.

ఆ వెంటనే అప్పలసూరి, రాజుకేసి చేతులు జోడించి, "ప్రభువులు నన్ను రక్షించాలి! ఆ ధనికుడి కంకణం నేనే అపహరించాను. నేను మనసులో దేన్నయినా నిశ్చయించుకున్నానంటే, ఎంతటి వారూ ఆ నిశ్చయాన్ని సడలించలేరు. తమరు నా నేరం బయటపెట్టించ లేకపోవడానికి, అదే కారణం!" అన్నాడు.

ధరహాసుడు చిన్నగా చప్పట్లు చరిచి, "ప్రభూ, దొంగదొరికాడు గదా! ఈ నౌకరు తేనె పూసిన కత్తిలాంటి వాడు. ఇలాంటి వాడిని స్వేచ్ఛగా వదిలివేయడం, పౌర జీవనానికి హానికరం. వీడికి యావజ్జీవ కారాగార శిక్ష విధించండి," అన్నాడు.

రాజు అలాగే చేశాడు. ధరహాసుడి తెలివి తేటలను రాజు చాలా ప్రశంసించాడు.



# చందమామ అనుబంధం—21

## మన విజ్ఞాన సంపద

### ఎవరాయన?

తిరుచిరాపల్లిని పరిపాలించిన విజయరంగ చొక్కలింగ రాజుకు, నగర ఆలయ సమీపంలో నివసించే సాధువుపట్ల భక్తిగౌరవాలు వుండేవి. ఆ సాధువుకు ఏదైనా ఉపయోగపడే విలువైనకానుకను ఇవ్వాలని రాజు అనుకున్నాడు.

నగరంలోని ఒక ప్రముఖ వ్యాపారి, వ్యాపారరీత్యా కాశ్మీరుకు బయలు దేరుతూ, రాజు దగ్గర సెలవు తీసుకోవడానికి వచ్చాడు. అప్పుడు రాజు అతనితో, కాశ్మీరు నుంచి అందమైన మంచి ఉన్నిశాలువాను తెమ్మని చెప్పాడు. వ్యాపారి అలాగే తిరిగి వచ్చినప్పుడు, మంచి పనితనం గల విలువైన ఉన్నిశాలువాను తెచ్చి రాజుకిచ్చాడు. రాజు సాధువును, సభకు ఆహ్వానించి, ఉన్నిశాలువాను ఆయనకు కానుకగా ఇచ్చాడు.

మరునాడు ఒక అధికారి వచ్చి, "మహారాజా, చూశారా ఆ సాధువు అహంభావం! తమరిచ్చిన విలువైన శాలువాను ఒక బిచ్చగత్తెకు ఇచ్చేశాడు!" అని చెప్పాడు.

ఆ మాటలకు ఆగ్రహం చెందిన రాజు, సాధువును రప్పించి, "నీకిచ్చిన కాశ్మీరు శాలువాను ఏం చేశావు?" అని అడిగాడు.

"దానిని నేనొక దివ్యమాతకు సమర్పించాను," అన్నాడు సాధువు.

రాజు ఒక్క క్షణం అవాక్కయిపోయాడు. సాధువు ప్రతి ప్రాణిలోనూ, దైవాన్ని సందర్శించగల జ్ఞాని అని రాజు గ్రహించాడు.

ఎవరా సాధువు? (36 వ పేజీ చూడండి)

### మీకు తెలుసా?

1. మనం నివసిస్తూన్న భూగోళం ఎప్పుడు ఏర్పడింది?
2. భూమి మీద ప్రాణులు ఎప్పుడు ఏర్పడ్డాయి?
3. 'విశ్వం' అంటే ఏమిటి?
4. కుజగ్రహాన్ని చేరిన వ్యోమనౌక ఏది? ఎప్పుడు చేరింది?
5. అది తన గమ్యాన్ని చేరడానికి ఎంతకాలం పట్టింది?
6. అది పయనించిన దూరం ఎంత?

(36 వ పేజీ చూడండి)

## భారతదేశం: నాడు - నేడు.

# అంగరాజ్యం

అంగరాజ్యం పేరు వినగానే, మహాభారతంలోని దానకర్ణుడు జ్ఞాపకం వస్తాడు. దుర్యోధనుడు కర్ణుణ్ణి అంగరాజ్యాధిపతిని చేశాడు. అయినప్పటికీ కర్ణుడు మాత్రం జీవితంలో ఎక్కువ కాలం హస్తినాపురంలోనే గడిపి, కురుక్షేత్రయుద్ధంలో వీరమరణం పొందాడు.

ఈనాటిబీహార్‌లోనితూర్పుప్రాంతాన్ని పూర్వకాలంలో అంగరాజ్యం అని పిలిచేవారు. సుసంపన్నమైన ఆ ప్రాంతం ఉత్తరోత్తరా మగధసామ్రాజ్యంలో ఒక భాగమయింది. అంగదేశ రాజధాని చంపానగరం చాలా సుందరమైన నగరం. రాజ్‌మహల్ కొండలకు పశ్చిమంగా, చంపా, గంగానదుల సంగమం వద్ద చంపానగరం వెలసింది.

క్రీ. శ. 2 వ శతాబ్దంలో భారతదేశం నుంచి 'అన్నం' (ఈనాటి వియత్నాం)కు వలసవెళ్ళి రాజ్యం స్థాపించిన హిందువులు తమ నూతన రాజధానికి 'చంపా' అని పేరు పెట్టుకున్నారు. 'చంపా' అనే పేరు అంతటి ప్రసిద్ధమైనది.

అంగరాజ్యంబీహార్‌లో భాగంగా ఉన్నప్పటికీ, కాలప్రవాహంలో ఆ నగరం ఆనవాలు కూడా లేకుండా పోయింది. భగల్పూర్‌కు సమీపంలో 'చంపానగర్' 'చంపాపుర' అనే రెండు గ్రామాలపేర్లు, చంపానగరాన్ని గుర్తు చేస్తున్నాయి.




భగల్పూరుకు వచ్చే యాత్రికులు, కోల్‌గాంగ్ వద్ద వున్న రాతి దేవాలయాన్ని, సుప్రసిద్ధమైన బరారీ గుహలను సందర్శించడానికి ఎక్కువ ఆసక్తి చూపుతారు. భగల్పూరు సమీపంలో మరికొన్ని

ంపానగరం



యాత్రాస్థలాలు కూడా ఉన్నాయి. కాని, ఒకానొకప్పుడు ఆ ప్రాంతంలో ఎంతో ప్రఖ్యాతిగాంచిన చంపానగరం గురించి మాత్రం చాలామందికి అంతగా తెలియదు!

## చందమామ కబుర్లు

### అనుకరణ కూడా ఒక కళే!

గొప్ప చిత్రకారుల చిత్రాలకు మంచి ధర పలుకుతుందన్న విషయం అందరికీ తెలిసినదే. అందువల్ల అటువంటి గొప్ప చిత్రాలను కొందరు అలాగే కాపీ దించడం చేస్తారు. ఇటువంటి నకిలీ చిత్రాలు ఒక్కొక్కసారి అసలు చిత్రాలలాగే వుండడం కద్దు।

శతాబ్దాల తరబడి, ఇలా అనుకరించి చిత్రించిన సుప్రసిద్ధ చిత్రాలను సేకరించి, లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియం ఒక భాగంలో శాశ్వత ప్రదర్శనకు ఏర్పాటుచేస్తున్నారు. అనుకరించినప్పటికీ వాటిని చిత్రించినవాళ్ళూ చిత్రకారులే కదా।



# సాహిత్యావలోకనం

1. ఒక ప్రముఖ ఆంగ్ల నవలా రచయిత గ్రంథంలో ప్రాచీన భారతీయ కథలు కొన్ని చోటు చేసుకున్నాయి. ఆ నవలా రచయిత ఎవరు?

2. ఆయన రచించిన సుప్రసిద్ధ గ్రంథం ఏది?

3. భారతీయ పాఠకులకు సుపరిచయమైన స్కాట్‌లాండ్ నవలా రచయిత ఎవరు?

4. ఆయన రచించిన సుప్రసిద్ధ నవల పేరేమిటి?

5. ప్రపంచంలోకెల్లా అతి ప్రాచీనమైన భాష ఏది?

## సమాధానాలు

ఎవరాయన?

1. తాయుమానవర్.

లోకజ్ఞానం

1. బహుశా క్రీ. పూ. 460,0 000,000 వ సం॥
2. క్రీ. పూ. 2 000 000,000 వ సం॥
3. సూక్ష్మాతి సూక్ష్మమైన అణువునుంచి, బ్రహ్మాండమైన నక్షత్ర కుటుంబాలవరకు గలది.
4. "వైకింగ్". 1976 వ సంవత్సరంలో.
5. ఒక సంవత్సరం కన్నా ఎక్కువ.
6. 20 కోట్ల కి॥ మీ॥

సాహిత్యం

1. జిఫ్రేఛాసర్ (1340-1400)
2. ది కాంటర్‌బరీ టేల్స్
3. సర్ వాల్టర్‌స్కాట్ (1771-1832)
4. ఐవాన్ హో
5. సంస్కృతం.



# శ్రీ రామకృష్ణ పరమహంస (2)

కలకత్తాకు దక్షిణంగా వున్న జాంబజార్‌లో రాణి రాస్మాని అనే దానగుణం గల సంపన్నురాలయిన భక్తురాలు ఉండేది. వితంతువు అయిన రాణి రాస్మానికి ఒకసారి కాశీ క్షేత్రాన్ని దర్శించాలన్న కోరిక కలిగింది.

అమె పెద్ద పడవలో కాశీకి బయలు దేరింది. ఆ పడవ వెంట చిన్నచిన్న పడవలలో అమె పరివారమంతా బయలు దేరింది. ఒక రోజల్లా ప్రయాణంచేసి, సాయంకాలానికి వాళ్ళు దక్షిణేశ్వరం చేరుకున్నారు.





ఆ రాత్రి రాణి నిద్రలో ఒక కలవచ్చింది. ఆ కలలో జగన్మాత కనిపించి, "నా భక్తురాలయిన నువ్వు కాశీకి వెళ్ళాలా? ఇక్కడే నాకొక గుడి కట్టించవచ్చు కదా?" అని అన్నదట. మరునాడు ఉదయం, రాణి ఆ చుట్టుపక్కల సుందర ప్రాంతాన్ని తిరిగి చూసి, కాశీ ప్రయాణాన్ని విరమించుకున్నది.



రాణి అక్కడి భూములు కొని, దేవాలయం నిర్మించడానికి ప్రారంభించింది. రాణి, జగన్మాత భక్తురాలు. అందువల్ల ఆలయంలో కాళీమాతను ప్రధాన దేవతగా ప్రతిష్ఠించాలని ఆమె ఆశించింది.

ఒకనాడు రాణిగారి మనుషులు, గదాధరుడి అన్న రామ్‌కుమార్ వద్దకు వెళ్ళి, దక్షిణేశ్వర ఆలయంలో దేవీ విగ్రహాన్ని ప్రతిష్ఠించి, ఆలయ ప్రధాన పూజారిగా బాధ్యతలు స్వీకరించమని రాణిగారి కోరికగా తెలియజేశారు.





రామ్‌కుమార్ అందుకు అంగీకరించాడు. ఆగమశాస్త్ర ప్రకారం ఆలయంలో విగ్రహప్రతిష్ఠాపన జరిగింది. భారతదేశం వివిధ ప్రాంతాల నుంచి. పలువురు బ్రాహ్మణులూ, పండితులూ ఆ ఉత్సవానికి హాజరయ్యారు.

అన్నతోపాటు వెళ్ళిన గదాధరుడికి ఆ స్థలమెంతో నచ్చింది. గంభీరంగా ప్రవహిస్తూన్న గంగానది ఆయనలో ఉత్తేజం కలిగించింది. ప్రశాంత నదీ తీరంలోనూ, సమీప అరణ్యంలోనూ, ఆయన తరచూ ధ్యానం చేస్తూ గడిపే వాడు.





రాణి రాస్మొనీకి కుమారులు లేరు. ఆమె అల్లుడు మధురానాథ్ విద్యావివేక సంపన్నుడు. ఆయన, గదాధరుణ్ణి చూడగానే అతనిలో ఏదో మహత్తర మైన ప్రత్యేకత ఉన్నట్టు గ్రహించాడు.

మధురానాథ్, గదాధరుణ్ణి, ఆలయంలో అన్నకు సహాయంగా పూజారిగా వుండ మని కోరాడు. గదాధరుడు అందుకు సంతోషంగా అంగీకరించాడు. అయితే, ఆయన ఒక్కొక్కసారి సంప్రదాయ బద్ధమైన పూజావిధులను మరిచిపోయి, దేవీ విగ్రహం ముందు ధ్యానంలో కూర్చునేవాడు.





కొన్నేళ్ళ తరవాత రామ్‌కుమార్ వ్యాధిగ్రస్తుడై మరణించాడు. తదనంతరం గదాధరుడు కాళికాలయప్రధాన పూజారి అయ్యాడు. అయితే, తనకు తోచిన పద్ధతిలో ఆయన తన బాధ్యతలను నిర్వహించసాగాడు.

గదాధరుడిపూజావిధానంపట్లఅసంతృప్తి చెందిన కొందరు బ్రాహ్మణులు, ఆ విషయం గురించి మధురానాథ్‌కు ఫిర్యాదు చేశారు. అయినా, ఆలయ విగ్రహంలో దివ్యశక్తిని ప్రేరేపించగల శక్తి గదాధరుడికి మాత్రమే ఉన్నదని గ్రహించిన మధురానాథ్, వారి మాటలను పట్టించుకోలేదు.





గదాధరుడు కొన్నాళ్ళు నిష్ఠతో పూజలు జరిపాక, కాళీమాతను ప్రత్యక్షంగా చూడాలనుకున్నాడు. ఆయన ఒకనాడు, ఏకాగ్రచిత్తంతో, "తల్లీ, ఇప్పుడు నీ దర్శనం కాలేదంటే, నీ పాదాల వద్ద వున్న ఖడ్గంతో నా ప్రాణాలు తీసుకుంటాను!" అని కన్నీళ్ళతో దీనంగా ప్రార్థించాడు. హఠాత్తుగా మెరుపు వంటి కాంతిలో విగ్రహంముందు కాళీమాత ప్రత్యక్షమయింది. —(ఇంకావుంది)



# ఇద్దరు గజదొంగలు

భవానీనగరాన్ని చిత్రసేనుడనే రాజు పరిపాలిస్తున్నకాలంలో, గంగడు అనే దొంగ, నగరంలో చాలామంది ఇళ్ళను దోచుకుంటూ, రాజభటులకు దొరకకుండా తప్పించుకు తిరుగుతూండేవాడు.

గంగడు ఒకసారి, ఒక రాజోద్యోగి ఇంట జొరబడ్డాడు. అక్కడ వాడికి అనేక విలువైన వస్తువులు దొరికాయి. గంగడినీ, వాడి అనుచరులనూ చూసి, రాజోద్యోగి ప్రాణభయంతో, వాళ్ళకు అన్నీ అప్పగించాడు.

వారం రోజుల తర్వాత గంగడు, ఒక వ్యాపారి ఇంట ప్రవేశించి, వ్యాపారిని కత్తితో బెదిరించి, ఆ ఇంట దొరికిన విలువైన వస్తువులన్నిటినీ మూటకట్టి, తన అనుచరులతో పరారీ అయ్యాడు.

మరి కొన్నాళ్ళ తర్వాత వాడు, ఒక రైతు ఇంటికి కన్నం వేశాడు. అక్కడ కూడా వాడికి కొన్ని విలువైన ఆభరణాలు దొరికాయి. వాటిని మూటగట్టుకుని వాడూ, అనుచరులూ పారిపోయారు.

కొంతకాలం ఆగి, ఈసారి గంగడు ఒక పూజారి ఇంటికి కన్నం వేశాడు. అక్కడ వాడికి కొద్దిపాటి విలువైన వస్తువులు మాత్రమే దొరికాయి. అయినా వాడు వాటిని వదలకుండా అనుచరులతో మూట గట్టించి వెంట తీస్లుకుపోయాడు.

గంగడు ఒకనాడు, తను ఇంతవరకూ దొంగిలించిన, ఆ నాలుగు ఇళ్ళలోని వస్తువులనూ లెక్క వేసి చూస్తే, రాజోద్యోగి ఇంట తనకు చాలా విలువైన వస్తువులు దొరికినట్టు తేలింది.

అంతేకాక, వాడు మరొక ఆశ్చర్యకరమైన విషయం, తెలుసుకున్నాడు. వస్తువులు పోగొట్టుకున్న వాళ్ళలో, ఒక్క రాజోద్యోగి తప్ప, మిగిలిన ముగ్గురూ తమ

రాంబాబు



ఈసారి కూడా ఒక్క రాజోద్యోగి తప్ప, మిగిలిన ముగ్గురూ తమ ఇంట దొంగతనం జరిగినట్టు రాజుకు విన్నవించుకున్నారు.

రాజోద్యోగి, రాజుకు ఫిర్యాదు చేయక పోవడం గురించి, గంగడికి ఆశ్చర్యంతో పాటు కొంత అనుమానం కూడా కలిగింది.

ఇలా వుండగా, ఒకనాటి రాత్రి వాడు, ఒక సంపన్నుడి ఇల్లు దోచబోయి, కాపలా వాళ్ళకు దొరికిపోయాడు. వాడి అను చరులు మాత్రం తప్పించుకుని పారిపో గలిగారు.

సంపన్నుడు, గంగడిని ప్రశ్నించి, తన కాపలావాళ్ళు పట్టుకున్నది పేరుమోసిన గజదొంగనని తెలుసుకుని, కాపలా వాళ్ళతో, "ఒరే, రాజభటులంతటి వాళ్ళు చేజిక్కించుకోలేని గంగడంతటి గజ దొంగను, మీరు సునాయాసంగా పట్టేశారు. మీరు వీణ్ణి తిట్టడం చేయకండి. తీసుకు పోయి రాజభటులకు అప్పగిస్తే, రాజుగారే వీణ్ణి విచారించి నిలువునా కొరత వేయించు తారు," అన్నాడు.

కాపలావాళ్ళు, గంగడిని రాజభటుల పరం చేశారు. వాళ్ళు వాణ్ణి, రాజుగారి ముందు నిలబెట్టారు. రాజు, గంగడిని అనేక విధాలుగా ప్రశ్నించి, చివరకు, "ఒరే, ఎంతటి తెలివిగల దొంగ అయినా, ఏదో ఒకనాడు పట్టుబడకపోడన్న సత్యం,

ఇంట దొంగతనం జరిగినట్టు, రాజుకు ఫిర్యాదు చేశారు. రాజోద్యోగి ఎందుకు ఫిర్యాదుచేయలేదో వాడికి అంతుబట్టలేదు.

గంగడు మరి రెండు నెలల వ్యవధి తర్వాత, మరొకసారి రాజోద్యోగి ఇంట దొంగతనానికి వెళ్ళాడు. ఈసారి వాడికి ఆశ్చర్యం కలిగేలా, రాజోద్యోగి ఇంట మునుపటికన్న విలువైన వస్తువులు దొరి కాయి. వాడు అదేవిధంగా, మరొకసారి వ్యాపారి, రైతు, పూజారి ఇళ్ళలో దొంగ తనం చేశాడు. కానీ, ఈసారి వాడికి అంతగా విలువైన వస్తువులేమీ దొరకలేదు. తన దొంగతనం దెబ్బనుంచి, వాళ్ళు ఇంకా కోలుకోలేదని గంగడు గ్రహించాడు.

నీ విషయంలో రుజువైంది. నిన్ను చిత్ర హింసలకు గురి చేయమంటావా? లేక అదేం లేకుండా, ఈ మధ్యకాలంలో నువ్వు దొంగిలించినదంతా, నా భటులకు అప్పగిస్తావా?'' అని అడిగాడు.

''మహారాజా, చిత్రహింసలకు గురయ్యాక ఎలాగూ తప్పదుగదా—అందు వల్ల ముందుగానే, నేను దొంగిలించినదంతా తమ ఎదట వుంచుతాను,'' అన్నాడు గంగడు.

గంగడు చెప్పగా, రాజభటులుపోయి, వాడు దాచిన చోటునుంచి దొంగిలించిన సొత్తంతా తీసుకువచ్చారు. ఈ సంగతి విన్న వ్యాపారీ, రైతూ, పూజారీ రాజు వద్దకు వచ్చి, గంగడు తమ ఇంట దోచుకుపోయిన వస్తువులను, తమకు ఇప్పించవలసిందిగా కోరారు.

అప్పుడు రాజు, గంగడిని, తను ఎవరింట ఏఏ వస్తువులు దోచుకుపోయాడో, వాటిని విడివిడిగా ఒకచోట చేర్చమన్నాడు.

గంగడు, వ్యాపారీ, రైతూ, పూజారీ ఇళ్ళ దోచుకున్న వస్తువులను ఒకపక్కగా పెట్టి, మిగిలినవాటిని రాజుకు చూపుతూ, ''మహారాజా, వీటిని రాజమార్గం మలుపు తిరిగినచోటగల, గాడిబావి పక్కనున్న రాజోద్యోగి ఇంటి నుంచి దోచుకుపోయాను,'' అన్నాడు.

రాజు, వాటికేసి చూసి ఆశ్చర్యపోతూ, ''ఇంత విలువైన వస్తువులు, ఏ సామంతుడి భవనం నుంచో దోచుకుపోయా



నంటే నమ్మగలనుగాని, ఒక సామాన్య రాజోద్యోగి ఇంటి నుంచి అంటే ఎలా నమ్మడం? పైగా అతడు తన ఇంట దొంగతనం జరిగినట్టు ఫిర్యాదు కూడా చేయలేదు!'' అన్నాడు.

ఆ మాటలకు గంగడు నవ్వి, ''మహారాజా, నాకూ తమకు కలిగిన అనుమానం లాంటిదే కలిగి చాలాకాలం ఆలోచించాను. తేలిందేమంటే—ఈ రాజోద్యోగి పరమ లంచగొండి. విరివిగా ప్రజల నుంచి లంచాలు గుంజి మూటగట్టుకునే ఇతడు, నిజానికి నాకన్న కూడా గజదొంగ. తన నేరాలు బయటపడగలవన్న భయంతో. తన ఇంట జరిగిన దొంగతనాల గురించి, తమకు ఫిర్యాదు చేయలేదు,'' అన్నాడు.

''నా కొలువులో లంచగొండులా!'' అంటూ రాజు ఆశ్చర్యపోయి, భటులను పంపి రాజోద్యోగిని పిలిపించాడు.

రాజు బెదిరిస్తూ కఠినంగా ప్రశ్నించగా, రాజోద్యోగి తన నేరాన్ని ఒప్పుకున్నాడు. రాజు, అతడికి అప్పటికప్పుడే కారాగార శిక్ష విధించి, గంగడితో, ''నీవల్ల ఒక లంచగొండి శిక్షకు గురైయ్యాడు. ఇది మిగతావాళ్ళకు పాఠంగా వుంటుంది. సరే, నీకెలాంటి శిక్ష విధించాలి!'' అంటూ ఆలోచనలో పడ్డాడు.

అప్పుడు గంగడు రెండు చేతులూ జోడించి, ''మహారాజా, నన్ను తలదన్నిన గజదొంగను తమకు పట్టిచ్చాను. అందుకు నాకేదైనా బహుమానం యివ్వడానికి బదులు, నన్ను శిక్షకు గురిచేస్తారా?'' అన్నాడు.

రాజు వాడి మాటలకు పెద్దగా నవ్వి, ''అయితే, నా బహుమానం మాట విను! ఈ రోజునుంచీ నువ్వూ, నీ అనుచరులూ దొంగతనాలు మాని, చేతనైన మరే పనయినా చేసుకుని బతకాలి. ఇందుకు భిన్నంగా జరిగిందో, మీ అందరినీ నిలువునా కొరత వేయిస్తాను,'' అని భటులకు గంగడిని విడిచి పుచ్చవలసిందిగా ఆజ్ఞాపించాడు.





# పిల్ల హనుమాన్

ఇంద్రుడు అండ ఉన్నాడు గదా అన్న ధైర్యంతో రాహువు ఆంజనేయుడి మీదికి వెళ్ళాడు. ఆంజనేయుడు రాహువును ఎగాదిగా చూసి, పండు అనుకుని పట్టుకోబోయాడు. ఆంజనేయుడు ఆర్భాటం చేసి ఉగ్రనరసింహమూర్తి లాగా మీదికి రావటం చూసి రాహువు కంగారుగా ఇంద్రుడి దగ్గిరికి పరిగెత్తుకుంటూ పోయి, "ఈ అబ్బాయి నన్ను చంపేస్తున్నాడు. రక్షించు!" అని కేకలు పెట్టాడు.

"భయపడకు," అంటూ ఇంద్రుడు తన ఏనుగును ముందుకు తోలాడు.

ఘీంకరిస్తూ తన మీదికి వచ్చే ఐరావతాన్ని చూసి ఆంజనేయుడు, "ఈ పండు తెల్లగా బాగుంది. దీన్ని తిని ఆకలి తీర్చుకుంటాను" అనుకుని, మీదికి వచ్చేసరికి, ఐరావతం కూడా బెదిరింది.

ఇంద్రుడికి కోపం వచ్చి, ఆంజనేయుడి పైన వజ్రాయుధం విసిరాడు. ఆ దెబ్బకు ఆంజనేయుడి దవడ విరిగిపోయింది. అతను ఉదయాద్రి మీద పడిపోయి, కదలకుండా ఉండిపోయాడు.

ఇది చూసి వాయుదేవుడికి దుఃఖం ముంచుకు వచ్చింది. అతనికి కోపం కూడా వచ్చి, సంచరించటం మానేశాడు.

ఈ లోపల అంజన పర్ణశాలకు తిరిగి వచ్చి చూసేసరికి, పక్కమీద బిడ్డలేడు. ఆమె తన బిడ్డ కోసం రకరకాలుగా ఏడవటం మొదలు పెట్టింది.

2. సుగ్రీవుడి వద్ద మంత్రిత్వం



దవడ పగలగొట్టి మూర్ఛ పోగొట్టిన సంగతీ, వాయుదేవుడు అలిగిన సంగతీ చెప్పి, కాపాడమని వేడుకున్నారు.

బ్రహ్మదేవుడు హంసవాహనం మీద వాయుదేవుడు ఉన్న చోటికి వెళ్ళి, "నాయనా, సమస్త ప్రాణులకూ ప్రాణమిచ్చే వాడివి. అంతటా ఉండే వాడివి! నువ్వు అలగటం ధర్మమా?" అన్నాడు.

వాయుదేవుడు వెళ్ళి, మూర్ఛపోయి ఉన్న ఆంజనేయుణ్ణి తన చేతుల్లో ఎత్తి తీసుకు వచ్చి, బ్రహ్మ కాళ్ళవద్ద పెట్టి నమస్కారం చేశాడు. బ్రహ్మ ఆ కుర్రవాణ్ణి తన చేత్తో తాకే సరికి, అతనిలో తిరిగి చైతన్యం వచ్చింది.

కేసరి ఆమెను ఊరడిస్తూ, "ఏడవకు. నీ కొడుకు ఉదయించే సూర్యుణ్ణి చూసి పండు అని భ్రమపడి పట్టుకోబోయాడు. ఈ సంగతి రాహువు చెప్పేసరికి ఇంద్రుడు వచ్చి, దవడ పగిలేటట్టు కొట్టాడు. నీ కొడుకు స్పృహ తప్పి, తూర్పు కొండ మీద పడి ఉన్నాడు. వాయుదేవుడు ఇంద్రుడి పైన అలిగి, సంచారం మానేశాడు. నీ కొడుక్కు సమస్త శుభాలు కలుగుతాయి," అన్నాడు.

ఈ మాటలతో అంజన ఊరడిల్లింది.

వాయుదేవుడు అలిగి స్తంభించి పోయేసరికి దేవతలు కంగారుపడి, బ్రహ్మ వద్దకు వెళ్ళి, ఇంద్రుడు ఆంజనేయుడి

ఇది చూసి వాయుదేవుడు సంతోషించి, లోక సంచారం చెయ్యటానికి బయలుదేరి పోయాడు. ఆ తరవాత బ్రహ్మ దేవతలతో, "ఈ కుర్రవాడు లోకాలన్నిటినీ సంతోషపెట్టగలవాడు. ఇతనికి వరాలు ఇద్దాం. ఇతను సాక్షాత్తూ శివుడి అవతారం," అన్నాడు.

అప్పుడు ఆంజనేయుడికి భూదేవి వేదశాస్త్రాలు వచ్చేటట్టుగా శక్తి నిచ్చింది; నీటి భయం లేకుండా వరుణుడు వరమిచ్చాడు; మృత్యుభయమూ, ముసలితనమూ లేకుండా యముడు వరమిచ్చాడు; కుబేరుడు యుద్ధాలలో



విజయం ఇచ్చాడు; విశ్వకర్మ కనక కుండలాలిచ్చాడు. ఇంద్రుడు అంజనేయుడికి హనుమంతుడు అనే పేరు పెట్టి, (హనువు అంటే దవడ.) వజ్రాయుధం చేత అతనికి హాని లేకుండా వరమిచ్చాడు. బ్రహ్మ హనుమంతుడికి దీర్ఘాయువూ, చిరంజీవిత్వమూ ఇచ్చాడు.

తరవాత బ్రహ్మ వాయుదేవుడితో, "నీ కొడుకు నిష్కల్మషమైన కీర్తి సంపాదిస్తాడు. ఎన్నడూ ఓడడు. ఏక వీరుడు. పర్వతంలాటి ధీరత్వం గలవాడు. అణిమాది సిద్ధులన్నీ ఇతనికి ఉంటాయి. తలుచుకున్న మాత్రాన విశ్వమంతా చూడగలడు. విరాగి, కోరిన రూపం పొందగలవాడు. ఇతనిలో అంతులేని శౌర్య, ధైర్య, దయాది గుణాలుంటాయి. ఎన్నో అద్భుతమైన పనులు చేస్తాడు. వాటిని నువ్వే చూస్తావు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

హనుమంతుణ్ణి గురించీ, అతను సూర్యుణ్ణి పట్టుకోబోవటం గురించీ చిత్రంగా చెప్పుకుంటూ దేవతలు కూడా వెళ్ళిపోయారు.

వాయుదేవుడు హనుమంతుణ్ణి తీసుకుపోయి అంజన కిచ్చాడు. ఆమె తన కొడుకును తిరిగి పొందినందుకు ఆనంద బాష్పాలు రాల్చింది. ఆ ప్రాంతాల తపస్సు చేసుకునే వాళ్ళు హనుమంతుడి సంగతి విని ఆశ్చర్యపడుతూ, "సూర్యుడి కాంతి శరీరం మీద పడితేనే తాపం కలుగుతుంది గదా. ఈ పిల్లవాడు వెళ్ళి సూర్యుణ్ణి పట్టుకోవట మేమిటి?" అనుకున్నారు.

తన కొడుక్కు దేవత లందరూ వరాలిచ్చిన సంగతి తెలిసి కేసరి చాలా సంతోషించాడు.

హనుమంతుడు పెరిగివస్తూ, సమస్తమైన జ్ఞానమూ కలిగి ఉండి కూడా ఆకతాయి పనులు చేస్తూ తిరగసాగాడు. మంచి పనులు చెయ్యాలి గాని, మర్కట చేష్టలు చెయ్యరాదనీ; దరిద్రులను



వెంటనే హనుమంతుడు సాత్వికుడుగా మారిపోయాడు. కొడుకులో ఈ మార్పు చూసి, అంజనా, కేసరీ తృప్తిపడ్డారు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు అంజన హనుమంతుడితో, "నాయనా, కిష్కింధలో వాలి, సుగ్రీవులని ఇద్దరు అన్నదమ్ములున్నారు. వారిని మా తల్లి అయిన అహల్య కన్నది. అందుచేత వాళ్ళు నీకు మేనమామలు. నువ్వు కిష్కింధకు వెళ్ళి, సుగ్రీవుడి అండచేరు. ఏ కారణం చేతనైనా వాలి సుగ్రీవుల మధ్య వైరం వస్తే నువ్వు వాలిని చంపేవు సుమా!" అన్నది.

బాధించటం చాలా అసహ్యమనీ తల్లి దండ్రులు ఎంత చెప్పినా వినక, అతను చిలిపి చేష్టలు చేస్తూ కాలం గడిపేవాడు.

లోకాలను రక్షించటానికి పుట్టిన ఈ హనుమంతుడు చిన్నతనంలోనే ఇంత అకతాయి పనులు చెయ్యట మేమిటో బ్రాహ్మణులకు అర్థం కాలేదు. ఏదన్నా శాపం పెడదామన్నా, అతనికి శాపాలు తగలకుండా బ్రహ్మ ఇచ్చిన వరం ఉన్నది! అయితే, ఇంత మహాశక్తి మంతుడికి ఏ అడ్డూ, అదుపూ లేక పోతే లోకాలను తారుమారు చేయడా? అందు చేత ఆ బ్రాహ్మణులు హనుమంతుడికి తన బలం తెలియకుండా ఉండాలన్నారు.

హనుమంతుడు తల్లికి నమస్కరించి, సెలవు తీసుకుని, కిష్కింధకు వెళ్ళాడు. వాలి సుగ్రీవులు అతన్ని ఆదరించారు. అతను సుగ్రీవుడికి మంత్రిగా ఉండ నారంభించాడు. అతనికి వేదాలూ, శాస్త్రాలూ నేర్చుకోవాలని కోరిక కలిగింది.

ఒకనాటి ఉదయం హనుమంతుడు కాలకృత్యాలు తీర్చుకుని, సూర్యుడు ఉదయించే సమయానికి గగన మార్గాన ఎగిరి సూర్యుడి వద్దకు వెళ్ళి, నమస్కారం చేశాడు.

సూర్యుడు సంతోషించి, "సంకల్ప సిద్ధిరస్తు! ఏం, నాయనా, ఏం పని మీద వచ్చావు?" అని అడిగాడు.



"అయ్యా, వేదశాస్త్రాలు నేర్చుకోవటానికి వచ్చాను," అన్నాడు హనుమంతుడు.

"బాగానే ఉంది. కాని, నేను మేరు పర్వతం చుట్టూ అతివేగంగా తిరుగుతూ ఉంటాను. నా నుంచి శాస్త్రం నేర్చుకోవటం చాలా కష్టం అవుతుందే!" అన్నాడు సూర్యుడు.

దానికి హనుమంతుడు, "మహాత్మా, ఉదయపర్వతం మీద ఒక కాలూ, అస్తమయ పర్వతం మీద ఒక కాలూ పెట్టి మీ వద్ద చదువుకోమన్నారా, లేక మీకు ముందు నడుస్తూ చదువుకోమన్నారా?" అని సూర్యుణ్ణి అడిగాడు.

సూర్యుడు ఈ మాటకు సంతోషించి, "నాయనా, నీ వంటి వాడు సృష్టిలో మరెవడూ లేడు. రెండు కొండల మీదా పాదాలుంచి నిలబడు; దేవతలు చూసి ఆనందిస్తారు," అన్నాడు.

వెంటనే హనుమంతుడు సూర్యుడికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, తన శరీరాన్ని నక్షత్రాల కన్న పైగా ఉండేటట్టు పెంచి, అన్ని దిక్కులూ ఆక్రమించి, బ్రహ్మాండం నిండేటట్టు చేశాడు. ఆ అవతారం చూసి బ్రహ్మదేవుడే నివ్వెరపోయాడు. మునులూ, దేవతలూ హనుమంతుణ్ణి చూసి నమస్కారాలు చేశారు.

సూర్యుడు పొందిన అద్భుతం అంతా ఇంతా కాదు. ఆయన హనుమంతుడితో, "ప్రత్యక్ష రుద్రావతారుడివి! నాకు కీర్తి కలిగించటానికి వచ్చావే గాని, నేను నీకు ఏం ఉపదేశించగలను?" అన్నాడు.

హనుమంతుడు వినయంగా, "మహాత్మా, ఇలా అనవచ్చునా? వేదాలకు మూలమైనవాడివి. నన్ను శిష్యుడుగా చేసుకుని దయతో వేదత్రయం బోధించు," అంటూ తన మామూలు రూపం ధరించి, సూర్యుడి రథానికి ఎదురుగా నిలబడ్డాడు.

సూర్యుడు గడియకు తొమ్మిది లక్షల డెబ్బైవేల యోజనాల వేగంతో నడుస్తాడు. అంత వేగంతోనూ హనుమంతుడు



ఎగురుతూ, సూర్యుడికి ఎదురుగా నిలబడి, నేర్చుకోవలిసిన దంతా, స్మృతి పురాణాలతో కూడా నేర్చుకున్నాడు.

చదువు పూర్తికాగానే హనుమంతుడు సూర్యుడికి నమస్కారం చేసి, సెలవు పుచ్చుకుని, కిష్కింధ వెళ్ళి, తన సంగతులన్నీ చెప్పాడు. సుగ్రీవుడు హనుమంతుడిపట్ల హెచ్చు ప్రేమ కలిగి, అతన్ని తన వద్దనే ఉంచుకున్నాడు.

వాలి సుగ్రీవులు చాలా అన్యోన్యంగా ఉండేవారు. వారిని పెంచిన తండ్రి ఋక్షవిరజుడు చనిపోయాక వానరరాజ్యానికి వాలి రాజూ, సుగ్రీవుడు యువరాజూ అయ్యారు.

వాలి బలపరాక్రమాలు సాటిలేనివి. అతనితో యుద్ధం చేసి ఎవరూ గెలవలేదు. రాజులందరినీ జయించిన మదంతో రావణుడు ఒకసారి వాలి వద్దకు వచ్చి, అతన్ని యుద్ధానికి పిలిచాడు. వాలి రావణాసురుడితో యుద్ధం చేసి, అతన్ని చావ చితకగొట్టేశాడు. తరవాత రావణుడు వాలితో స్నేహంగా ఉంటూ వచ్చాడు.

తరవాత వాలిని యుద్ధానికి పిలిచిన వాడు దుందుభి అనే రాక్షసుడు. వాడు మదించి హిమవంతుణ్ణి యుద్ధానికి పిలిచాడు. హిమవంతుడు దుందుభితో, "బాబూ, నీతో యుద్ధం చేసే శక్తి నాకు లేదు. నీతో యుద్ధం చెయ్యగలవాడు వాలి ఒక్కడే. నువ్వు మధువనానికి వెళ్ళి, అతన్ని యుద్ధానికి పిలువు. తప్పక వస్తాడు," అన్నాడు.

ఆ మాట విని దుందుభి మధువనానికి వచ్చి, ఆ వనాన్ని ధ్వంసం చేస్తూ, వాలిని యుద్ధానికి పిలిచాడు. మధువనం కిష్కింధకు బయట ఉన్నది. వాలి దుందుభి పిలుపు విని వచ్చి, యుద్ధంలో వాణ్ణి చంపి, వాడి శరీరాన్ని విసిరివేశాడు. దుందుభి కళేబరం దూరాన ఉన్న ఋశ్యమూక పర్వతం మీద పడింది. వాడి రక్తం, ఆ పర్వతం మీద తపస్సు చేసుకుంటున్న మతంగ

మహాముని మీద పడింది. ఆ ముని కోపించి, వాలి ఋశ్యమూకం మీదికి వస్తే అతని తల పగిలి పోతుందని శాపం పెట్టాడు.

తరవాత వాలికి దుందుభి కొడుకైన మాయావితో వైరం వచ్చింది. దుందుభిని వాలి చంపి ఉండటమే గాక, ఒక స్త్రీ విషయంలో కూడా మాయావికీ, వాలికీ వైరం ఏర్పడింది.

ఒకనాటి అర్ధరాత్రి మాయావి కిష్కింధ నగర ద్వారం వద్దకు వచ్చి, పెడబొబ్బలు పెట్టుతూ, వాలిని యుద్ధానికి పిలిచాడు. నిద్రపోతున్న వాలి లేచి, శత్రువు దర్పం సహించలేక, వాడితో యుద్ధానికి బయలు దేరాడు. సుగ్రీవుడూ, వాలి భార్య అయిన తారా వద్దని వారించబోయారు కాని, వాలి వినలేదు.

వాలిని ఆపలేక సుగ్రీవుడు కూడా అతని వెంట బయలుదేరాడు. అన్నదమ్ము లిద్దరూ వస్తూండటం చూసి మాయావి భయపడి, పారిపోసాగాడు. వాలి, సుగ్రీవులు అతన్ని తరుముకుంటూ వెళ్ళారు. మాయావి వారిని చాలా దూరం తీసుకుపోయి, ముళ్ళకంపలు కప్పి ఉన్న ఒక కొండ బిలంలో ప్రవేశించాడు.

''నేను మాయావిని హతమార్చి వచ్చే వరకు నువ్వు ఇక్కడే ఉండు,'' అని సుగ్రీవుడితో చెప్పి, వాలి కూడా బిలం ప్రవేశించాడు.

వాలి ఎంతకూ తిరిగి రాకపోయేసరికి, అతను చచ్చిపోయాడేమోనని సుగ్రీవుడికి భయం వేసింది. ఇంతలో బిలంలో నుంచి నురుగుతో కూడిన రక్తం బయటికి రాసాగింది. బిలంలో నుంచి వచ్చే ధ్వనులు రాక్షసుడివిగా అతనికి వినిపించాయి.

సుగ్రీవుడు తన అన్నకోసం దుఃఖించి, ఆ బిలానికి కొండరాయి అడ్డం పెట్టి, అన్నకు జలతర్పణాలు విడిచి, కిష్కింధకు తిరిగి వచ్చాడు. వానరులు అతన్ని రాజుగా అభిషేకించారు.





# వరహాలు-వనదేవత

గంగవరం గ్రామంలో వుండే సూరయ్య, రమణమ్మలకు ఇద్దరు కొడుకులూ, ఒక కూతురు. కూతురు పేరు వరహాలు. ఆమె పెళ్ళీడుకు ఎదిగివచ్చింది. అయినా, ఏ ఒక్క సంబంధమూ రాలేదు. అందుకు ముఖ్యకారణం ఆమె స్థూలకాయానికి తోడు, నోటి దురుసుతనం. ఆమె నోటి ధాటికి తల్లిదండ్రులే కాక, ఇరుగుపొరుగు కూడా భయపడుతూంటారు. ఒళ్ళు బరువూ, నోటి దురుసూ తగ్గించుకుంటే గాని, ఆమెకు పెళ్ళి కాదని అందరూ అనుకోసాగారు. కానీ, ఈ సంగతి వరహాలుకు చెప్పే ధైర్యం మాత్రం ఎవరికీ లేదు.

ఆ మధ్య ఒకసారి, వరహాలుకు పినతల్లి వరసఅయిన ఒకావిడ పొరుగూరు నుంచి పని మీద వచ్చి, సంగతి విని, వరహాలుకు హితబోధ చేయబోయింది.

అయితే, వరహాలు గయ్‌మంటూ అవిడ మీదికి లేచి, "నువ్వేమైనా నాకు పెట్టి పోషిస్తున్నావా? నా తండ్రి బోలెడు సంపాయించాడు, నాకడుపు పట్టినంతతింటాను. నచ్చని మాటలు ఎవరైనా అంటే, యిష్టమొచ్చినట్టు తిట్టేస్తాను. పెళ్ళి అయినప్పుడే అవుతుంది. మూటాముల్లే సర్దుకుని వచ్చిన దారిపట్టు," అనేసింది.

ఇదేవిధంగా మరిద్దరుముగ్గురు దగ్గిర బంధువులు, వరహాలుకు హితవు చెప్పబోతే, వాళ్ళను నానా తిట్లూతిట్టి కొట్టేంత పని చేసింది. దానితో అందరూ ఆమె పెళ్ళిభారం దేవుడి మీద వేసి నిమ్మకు నీరెత్తినట్టు వుండిపోయారు.

ఆమె ఇద్దరన్నలు, చాలాకాలం చెల్లెలి పెళ్ళికోసం తమ పెళ్ళిళ్ళు మానుకుని ఎదురుచూసి, చివరికి విసిగి తమకు తగిన వధువుల్ని చూసి పెళ్ళాడేశారు.

గవ్వల నిర్మలాదేవి



వరహాలు తల్లిదండ్రులు బాగా వృద్ధులై పోయారు. తాము పోయేలోగా కూతురు పెళ్ళి చూడాలని వాళ్ళ కోరిక. అయితే, వదినెలు వచ్చాక కూడా వరహాలు ధోరణి మారలేదు. ఇక్కడ పుల్ల తీసి అక్కడ పెట్టకపోగా, వదినెల మీద తప్పులు ఎంచి సాధిస్తూండేది. వాళ్ళు కొంతకాలం చూసి, ఇద్దరూ ఒకటై వరహాలును ఎదిరించడం ప్రారంభించారు. దానితో రోజూ వదినెలకూ, మరదలికీ ఏదో విషయం మీద కీచులాట వచ్చేది. వరహాలు అలిగి ఊరిబయటి చెరువుకట్ట దగ్గిరకు వెళ్ళి, అక్కడున్న పెద్ద మర్రిచెట్టు కొమ్మకు ఊయలకట్టుకుని ఊగుతూ పగలంతా వుండిపోయేది. చీకటిపడ్డాక పొలంనుంచి వచ్చిన అన్నలు, వరహాలును వెతుక్కుంటూ వెళ్ళి, ఆమెను బతిమాలి ఇంటికి తీసుకు పోతూండేవాళ్ళు.

ఒక రోజున వరహాలు, వదినెలతో బాగా కీచులాడి, అలిగి చెరువుకట్ట దగ్గిరకు బయలుదేరింది. ఆమె ఆకలిని ఏమాత్రం ఓర్చుకోలేదు. వరహాలు ఇలా అలిగినప్పుడల్లా, ఇంట్లోంచి కొంత డబ్బు తీసుకుని, దారిలో వున్న అంగడిలో తినుబండారాలు పుష్కలంగా కొని, మర్రిచెట్టుకు కట్టిన ఊయలలో కూర్చుని తింటూ ఊగుతూ, చీకటిపడేవేళ అన్నలు వచ్చేవరకూ కాలం గడిపేది. ఆ రోజున కూడా అలాగే అంగట్లో వేరుశనక్కాయలూ, బెల్లపు అచ్చులూ కొనుక్కుని కొంగుకు మూట కట్టి, చెరువుగట్టు చేరింది.

అక్కడ మర్రిచెట్టుకు తను కట్టిన ఊయలలో, ఎవరో స్త్రీ కూర్చుని ఊగుతూ వుండడం, వరహాలు కంటబడింది. ఆ మరుక్షణం, ఆమె భద్రకాళిలా కళ్ళెర్ర చేసి చర్రునపోయి, "ఎవరు నువ్వు? నా ఉయ్యాలలో కూర్చోడానికి ఎన్ని గుండెలు!" అంటూ, ఆ స్త్రీ చెయ్యి పట్టుకుని బలంగా గుంజింది.

అంతవరకూ కళ్ళు మూసుకుని, తన్మయత్వంలో ఉయ్యాల ఊగుతున్న

ఆ స్త్రీ, చప్పున కళ్ళు తెరిచి కెవ్వుమంటూ అరిచి మాయమైపోయింది.

ఇది చూసి వరహాలు కోపంతో శివమెత్తి పోయి, "ఎవరు నువ్వు? ధైర్యముంటే, నా ముందుకు రా! నువ్వు దయ్యానివయినా, భూతానివయినా, పిశాచానివయినా—ఈ వరహాలు భయపడదు. ఏ మంత్రగాడి అవసరం లేకుండానే, నిన్నిక్కడే, ఈ చెట్టుకింద భూస్థాపితం చెయ్యగలను. ఒకవేళ నువ్వు ఏ దేవతవో అయిన పక్షంలో, ఈ గ్రామంలో వున్న అన్ని దేవతలగుళ్ళూ వెతికి, ఏదో ఒక రోజున నిన్ను పట్టుకుని మూడు చెరువుల నీళ్ళు తాగించకపోను!" అంటూ హుంకరించింది.



ఆ స్త్రీ వెంటనే ప్రత్యక్షమై, "నేనీ దాపులనున్న అడవిలోని వనదేవతను. ఇటుగా పోతూ, నేరక నీ ఊయల ఊగాను. నువ్వు గట్టిగా అరిచి నా ఉనికిని బయట పెట్టకు. నీకేం కావలసినా యిస్తాను. నేనీ అడవిలో వున్నట్టు తెలిస్తే, ఇక ప్రతి కట్టెలు కొట్టేవాడూ, కట్టెలు కొట్టడం మానేసి, నా కోసం చెట్టూ పుట్టా గాలించి వెతికి పట్టుకుని, వరాలివ్వమని గొడవ చేస్తాడు," అన్నది.

వరహాలు ఆ మాటలతో శాంతించి, "సరే, నువ్వీ ప్రాంతాల వున్నట్టు ఎవరికీ చెప్పను. నాకు త్వరలో పెళ్ళి జరిగేలా వరం యివ్వు," అన్నది.

"అలాగే వరం యిస్తున్నాను!" అని వనదేవత మాయమైపోయింది.

వనదేవత అనుగ్రహం వల్లనో ఏమో, మర్నాటి ఉదయం ఒక యువకుడు, పరుపుచుట్టా, చిన్న పెట్టెతో వరహాలు ఇల్లు వెతుక్కుంటూ వచ్చాడు.

ఆ సమయంలో, వరహాలు తీరిగ్గా బల్ల మీద కూర్చుని ఫలహారం తింటున్నది. యువకుడు వరహాలు కేసి కొంచెంసేపు చూసి, "ఇక్కడేదైనా గది లాంటిది అద్దెకు దొరుకుతుందాండి?" అంటూ పలకరించాడు.



ఈలోగా వరహాలు అన్నలిద్దరూ ఇంట్లోంచి బయటకు వచ్చి, ఆ యువకుడి వివరాలు అడిగారు. ఆ యువకుడి పేరు చలపతి. ఆ ఊరికి ఉపాధ్యాయుడుగా వచ్చాడు. ఇంకా పెళ్ళి కాలేదు. వెనకా ముందూ ఎవరూ లేని ఒంటరిగాడు.

వరహాలు అన్నలిద్దరూ కూడబలుక్కుని, వసారాకు ఒకపక్కగా వున్న గదిని అప్పటికప్పుడు శుభ్రం చేయించి, దాన్ని చలపతికి చాలా తక్కువ అద్దెకు ఇచ్చారు. చలపతి ఆనందంగా ఆ గదిలో బస ఏర్పాటు చేసుకున్నాడు.

చలపతి పొద్దున్నే లేచి స్నానం వగైరా ముగించి, ఇంత వండుకుతిని పాఠశాలకు వెళ్ళి, చీకటిపడ్డాక తిరిగి వస్తూండేవాడు. అతను వరహాలు కంటబడినప్పుడు, చాలా ఆసక్తిగా ఆమె కేసి చూస్తూండే వాడు.

ఇలా కొద్ది రోజులు జరిగాక, ఒకనాడు చలపతి, వరహాలు అన్నలతో తనకామెను పెళ్ళాడాలని వున్నదని చెప్పాడు. అయితే, ఆమె చేతివంట తిన్నాకే నిశ్చితార్థం జరుపుకుంటానన్నాడు. అతను బుద్ధి తెలిసినప్పటి నుంచీ వంట తనే చేసుకుని తింటున్నాడట! అందువల్ల వంట చేయడం అంటే విసుగ్గా వుంటున్నదనీ, మంచి వంట నేర్చిన భార్య దొరికితే బావుంటుందన్నది, తన అభిప్రాయంగా చెప్పాడు.

వరహాలు అన్నలు ఆనందంతో, ఈ విషయం ఇంటిల్లిపాదికీ చెప్పి, వరహాలును ఆ రోజు శ్రద్ధగా వంట చేయమన్నారు. ఆమెకు సహాయంగా ఎవరూ వంట గది ఛాయలకేసి కూడా వెళ్ళగూడదని, చలపతి షరతు పెట్టాడు.

వరహాలు వంట చేస్తూ, ఆలోచించ సాగింది. వనదేవత అనుగ్రహంవల్ల, తన కెలాగూ చలపతితో పెళ్ళి ఖాయం! అందువల్ల, ఇక్కడే తను కాస్త ముందు చూపుతో ఆలోచించాలి. ఇంతకాలం లక్షణంగా వంట చేసుకుతినే చలపతి, తన వంట ఏమాత్రం రుచిగా వున్నా ఇక

వంటజోలికి పోడు. దానితో జీవితాంతం తనకు వంటపని తప్పదు! ఇలా ఆలోచించిన వరహాలు, కావాలనే పని గట్టుకుని వంటకాలన్నీ చెడగొట్టింది.

చలపతితోబాటు భోజనానికి కూర్చున్న ఇంటిల్లిపాదికీ, వరహాలు వండినవి నోట్లో పెట్టుకోగానే రౌరవాదినరకాలు కనిపించినట్టయింది. చలపతి ముఖం ముడుచుకుని బయిటికి వెళ్ళాక, అందరూ వరహాలును గట్టిగా తిట్టి కోప్పడ్డారు. వరహాలు నిర్లక్ష్యంగా తలాడిస్తూ వూరుకున్నది.

మర్నాటి ఉదయం అందరూ నిద్ర లేచేసరికి, చలపతి గది ఖాళీగా కనిపించింది. గది మధ్యన ఒక చీటీ పడివున్నది. అందులో చలపతి—వరహాలు వంట జీవితాంతం తినేధైర్యంతనకులేదనీ, ఇకఆమె పెళ్ళిమాటకు వస్తే, పరమేశ్వరుడి వరం అయినా భంగపడి పోతుందనీ రాశాడు.

ఇది చదివి అందరికన్నా ఎక్కువగా వరహాలు బెంగపడిపోయింది. వనదేవత వరం, ఇలా పనికిరాకుండా పోతుందని, ఆమె ఊహించలేదు. ఆనాటి నుంచీ ఇంట్లో ప్రతి ఒక్కరూ ఆమెను నిర్లక్ష్యంగా చూడసాగారు. వరహాలు, వనదేవత కోసం చాలాసార్లు చెరువుకట్టమీదికి పోయింది. కాని, ఆ దేవత జాడ లేదు.

ఈ సంఘటన జరిగాక, వరహాలులో క్రమంగా మార్పు రాసాగింది. ఆమె పదినెలకు చేదోడువాదోడుగా వుండి పనీ పాటూ చేస్తూ, ఒద్దికగా వుండడం ప్రారంభించింది. రోజూ అంతో యింతో శరీర శ్రమ చేయడం మొదలుపెట్టాక, త్వరలోనే ఆమె స్థూలకాయం తగ్గి, మనిషి నాజూకుగా తయారైంది.

ఈ దశలో పొరుగూరి పెద్ద రైతొకాయన, తన కొడుక్కు వరహాలును చేసుకోదలచి, పెద్ద ఎత్తున లాంఛనాలతో వచ్చాడు. అందరూ ఆశ్చర్యపడేంత వైభవంగా వరహాలు పెళ్ళి, చక్కని వరుడితో జరిగిపోయింది. ఈ విధంగా వనదేవత వరం ఫలించింది!






# సుల్తానుగారిపిల్లి

ఎంసార్ అనే నగరంలో మహమ్మద్ అనే వర్తకుడుండేవాడు. అతను ఒకసారి రకరకాల సరుకులు కొని, అనేకమంది నౌకర్లను ఏర్పాటు చేసుకుని, బిడారుతో సహా వర్తకానికి బయలుదేరాడు. అనేక చోట్ల ఆగుతూ, తన సరుకు అమ్ముతూ, కొత్తసరుకులు కొంటూ, ప్రయాణం చేసి అతను ఒక కొత్త నగరానికి వచ్చాడు.

ఆ నగరంలో కొంతకాలం విశ్రాంతి తీసుకుందామనుకుని, ఒక సత్రంలో మహమ్మద్ తన నౌకర్లతో సహా బస ఏర్పాటు చేసుకున్నాడు.

అప్పుడు ఒక వర్తకుడు అతని వద్దకు వచ్చి, ''ఈ నగరానికి వచ్చే ప్రతి వర్తకుడూ మంచి మంచి కానుకలు పట్టుకుపోయి సుల్తానుగారి దర్శనం చేసుకోవాలి. ఆ కానుకలు పుచ్చుకుని సుల్తానుగారు ఆ వర్తకుణ్ణి తనతో చదరంగం ఆడటానికి ఆహ్వానిస్తారు. అదే ఇక్కడి మర్యాద.'' అన్నాడు.

అందుచేత, తనకేమాత్రమూ ఇష్టం లేకపోయినా, మహమ్మద్ ఒక బంగారపు పళ్ళెంలో, తన వద్ద ఉండే అమూల్యమైన వస్త్రాలు కొన్ని పెట్టుకుని, సుల్తాను భవనానికి వెళ్ళాడు.

సుల్తాను ఆ కానుకలన్నిటినీ స్వీకరించి, మహమ్మద్ స్వదేశం గురించీ, అతని వర్తకం గురించీ, అడిగి తెలుసుకుని, ''ఇవాళ రాత్రి మా ఇంటికి వచ్చెయ్యి; చదరంగం ఆడుకుందాం,'' అన్నాడు.

మహమ్మద్ చీకటి పడగానే రాజభవనానికి వెళ్ళాడు.

''ఆట నియమం చెబుతాను విను. నా దగ్గిర ఒక తెలివైన పిల్లి ఉన్నది. అది తెల్లవార్లూ తన తోక మీద ఏడు దీపాలను నిలిపి ఉంచగలదు. మనం ఆట ఆడు

అరేబియా జానపద కథ

తున్నంతసేపూ అది కదలకుండా ఆ దీపా
లను తన తోక మీద నిలిపి ఉంచినట్టయితే
నీ ఆస్తి అంతా నాది అవుతుంది; నిన్ను
బందిఖానాలో పెట్టిస్తాను. కాని, అలా కాక
నా పిల్లి ఏ మాత్రం కదిలి, ఏ ఒక్క దీపం
కిందపడినా నన్ను నీ ఇష్టం వచ్చినట్టు
చెయ్యవచ్చు. నా ఖజానా అంతా నీదే!''
అని సుల్తాను మహమ్మద్‌తో అన్నాడు.

పాపం, మహమ్మద్ ఏం చెయ్యగలడు?
పారిపోవటానికి లేదు, చదరంగం ఆడనన
టానికీ లేదు; సుల్తాను నియమాల ప్రకారం
ఆడి తీరాలి. ఈ పాడుదేశంలో అడుగు
పెట్టినందుకు మహమ్మద్ తనను తాను
తిట్టుకున్నాడు. అతనికి తన సొత్తు మీదా,
ఇంటి మీదా, ప్రాణాలమీదా ఆశపోయింది.

సుల్తాను తన తెలివైన పిల్లిని రప్పించి,
ఒకచోట కూర్చోబెట్టి, దాని తోక మీద ఏడు
ప్రమిద దీపాలు నిలబెట్టించాడు. తరవాత
సుల్తానూ, మహమ్మదూ చదరంగం ఆట
మొదలుపెట్టారు.

మూడు రాత్రులూ, మూడు పగళ్ళూ
ఆట సాగింది. పిల్లి కదలనే లేదు.
మహమ్మద్ ఇక భరించలేక, తాను ఆడ
లేననీ, ఓడాననీ ఒప్పుకున్నాడు.

సుల్తాను సత్రం నుంచి వర్తకుడి సరు
కులూ, డబ్బూ తెప్పించి, వర్తకుణ్ణి
బంధించి, కారాగృహంలో పెట్టించాడు.



అక్కడ మహమ్మద్ భార్య జరీనా తన
భర్తకోసం ఎంతో కాలం ఎదురు చూసింది.
అతని నౌకరు ఒకడు మట్టిగొట్టుకుని తిరిగి
వచ్చి, ఆమెకు జరిగినదంతా వివరంగా
తెలియజేశాడు.

అంతా విని జరీనా తన భర్తను బంధ
విముక్తుణ్ణి చెయ్య నిశ్చయించుకున్నది.
ఆమె బోలెడన్ని ఎలుకలను పట్టించి, ఒక
పెట్టెనిండా పెట్టించింది. కొంత బంగారం
వెంట తీసుకుని, మగవాడి దుస్తులు
ధరించి, ఒక బిడారుతో సహా బయలుదేరి,
సుల్తానుండే నగరానికి వెళ్ళింది.

అక్కడ అమె సత్రంలో విడిది చేసి,
నౌకర్లను వెంటబెట్టుకుని, ఒక బంగారు

ఎళ్ళం నిండా కానుకలుంచి, సుల్తాను భవనానికి పట్టించుకు పోయింది. తాను సుల్తానుతో చదరంగం ఆడేటప్పుడు, ఒక్కొక్క ఎలుకనే తామున్న గదిలోకి వదలమని ఆమె తన వెంట ఉన్న నౌకర్లను ముందుగా హెచ్చరించింది.

సుల్తాను జరీనాను చూసి మగవాడనే అనుకున్నాడు. ఆయన ఆమె తెచ్చిన కానుకలు స్వీకరించి, నియమాలు తెలిపి, ఆమెను చదరంగంఆటకుఆహ్వానించాడు.

ఇద్దరూ చదరంగం ఆడేటప్పుడు పిల్లి వచ్చి, తన తోకమీద ఏడు దీపాలూ నిలిపి, రాతిబొమ్మగాలా నిశ్చలంగా కూర్చున్నది.

అంతలో గోడ చాటున వున్న జరీనా నౌకర్లు, చదరంగం ఆట జరిగే గదిలోకి ఒక ఎలుకను వదిలారు. పిల్లి ఆ ఎలుకను చూసింది. దానికా ఎలుకను పట్టాలన్న ఉద్రేకం కలిగింది. కాని సుల్తాను పిల్లి కేసి తీక్షణంగా చూశాడు. పిల్లి తన ఆరాటాన్ని నిగ్రహించుకుని ఎప్పటిలాగే కూర్చున్నది.

కొంచెంసేపు జరగనిచ్చి, జరీనా నౌకర్లు మూడు నాలుగు ఎలుకలను వదిలారు, అవి చదరంగం ఆట జరిగే గదిలో అటూ ఇటూ కంగారుగా పరిగెత్తసాగాయి. వాటిని చూసేసరికి పిల్లికి నిగ్రహం పూర్తిగా పోయింది. అది తానున్న చోటు నుంచి ఒక్క దూకు దూకి ఎలుకల వెంట పరిగెత్తింది. దాని తోక మీది ఏడు దీపాలూ కింద పడిపోయాయి.

మరుక్షణమే జరీనా మనుషులు లోపలికి వచ్చి, సుల్తానును పట్టుకుని బాదారు. సుల్తాను కేకలు పెట్టాడు. ఆయన నౌకర్లు ఆ కేకలు విని కూడా రక్షించడానికి రాలేదు. పరమక్రూరుడూ, నీచుడూ అయిన తమ సుల్తానంటే వాళ్ళకూ అసహ్యమే.

జరీనా సుల్తానును బంధించి, కారాగృహంలోకి తోయించి, ఆ కారాగృహంలో బంధితుడై ఉన్న తన భర్తనూ, మరి కొందరినీ విడుదల చేయించి, తన భర్తతో సహా స్వదేశానికి తిరిగి వెళ్ళిపోయింది.





# వాకిలిదూరని లడ్డు

ఒకనాడు ఒక మనిషి వీధి వెంట దోసకాయల బస్తా నెత్తిన పెట్టుకుని అమ్ముకుంటూ వచ్చాడు. పనిలేని పాపయ్య ఒకడు ఎదురుపడి, దోసకాయల మనిషిని నిలవేసి, ఏవేవో అర్థంలేని ప్రశ్నలు వేయసాగాడు. దోసకాయల మనిషి, ''కొనేబేరం కాదు, పెట్టేబేరం కాదు, పోవయ్యా!'' అన్నాడు.

పాపయ్యకు పట్టరాని పౌరుషం వచ్చింది.

''మన సంగతి తెలీదల్లేవుంది. బేరం తేల్చు, ఆ బస్తాడు దోసకాయలూ ఇప్పుడే తినేస్తాను,'' అన్నాడు పనిలేని పాపయ్య.

''నీవంటివాళ్లని నలుగుర్ని వెంటతెచ్చుకున్నా కూడా నీవల్లకాదు. పోవయ్యా, పో,'' అన్నాడు దోసకాయల మనిషి.

"పందెం వెయ్యి," అన్నాడు పాపయ్య పట్టుదలగా.

''నువ్వీ దోసకాయలన్నీ తిన్నావే, నీకు వాకిలి దూరనంత లడ్డు పెట్టిస్తా,'' అన్నాడు దోసకాయల మనిషి.

''పెట్టించలేవు. పది రూపాయల పందెం!'' అన్నాడు పనిలేని పాపయ్య.

''నువ్వీ దోసకాయలన్నీ తిన్నప్పటి మాటకద!'' అన్నాడు దోసకాయల మనిషి నవ్వుతూ.

''బస్తా దించు,'' అని పనిలేని పాపయ్య బస్తాలో వున్న ఒక్కొక్క దోసకాయే కొంచెం కొంచెం కొరికి ఉమ్మేశాడు.

''ఏం, పరాచకమా?'' అన్నాడు దోసకాయలవాడు.

''పరాచకమేమిటి? నీ దోసకాయలన్నీ తినేశాను,'' అన్నాడు పనిలేని పాపయ్య కోపంగా.

''ఇదేనా తినటమంటే?'' అన్నాడు దోసకాయల మనిషి.

"ఎవరికైనా అమ్మజూపు. ఏమంటారో నీకే తెలుస్తుంది," అన్నాడు పాపయ్య.

ఈపాటికి చుట్టూ జనం మూగారు. ఆ కాయలన్నీ తినేసిన కాయలేనని వాళ్ళూ ఒప్పుకున్నారు. చేసేదిలేక దోసకాయల వాడు తన గోతం తీసుకుని వెళ్ళిపో బోయాడు. కాని పనిలేని పాపయ్య అడ్డు తగిలి, "లడ్డు మాటేమిటి? దానికూ్కడా పందెం కాశాను మరి," అన్నాడు.

"వాకిలి దూరని లడ్డు ఆ మనిషి మాత్రం ఎక్కడ తెస్తాడు. పందెం ఓడి నందుకు ఓరూపాయి ఇస్తాడులే!" అని పక్కన వున్నవాళ్ళు అన్నారు.

"అదంతా కుదరదు. పదిరూపాయలూ కక్కితీరాలిసిందే!" అన్నాడు పాపయ్య.

"అయితే వాకిలి దూరలేని లడ్డు తెస్తా నుండు," అంటూ దోసకాయల మనిషి, పక్కనే వున్న మిఠాయికొట్టుకు వెళ్ళి అర్ధణా పెట్టి బెల్లం లడ్డు ఒకటి తెచ్చాడు.

"ఇదేనా వాకిలి దూరని లడ్డు?" అన్నాడు పనిలేని పాపయ్య వెటకారంగా.

"మరి ఏమిటనుకున్నావు. నీ ఇష్టం వచ్చినవాకిలి కోరుకో. దూరదని చూపి స్తాను," అన్నాడు దోసకాయల మనిషి.

అందరూ కలిసి పక్కనే వున్న ఇంటి వాకిలి దగ్గిరికి వెళ్ళారు. దోసకాయల మనిషి లడ్డును గడప అవతల పెట్టి, "దూరు!" అన్నాడు. లడ్డు కదలలేదు.

"చూశావా, వాకిలి దూరదు!" అన్నాడు దోసకాయలవాడు.

ఆ మాటతో పనిలేని పాపయ్యకు గంగ వెర్రులెత్తినై. చుట్టూ ఉన్నవాళ్ళంతా, "ఆ మనిషి చెప్పింది నిజమే," అన్నారు.

"అంటే సరి!" అని గొణుగుతూ పని లేని పాపయ్య జారుకోబోయాడు.

దోసకాయలవాడు, "పందెం ఓడావు. పది రూపాయలూ పెట్టిపో!" అన్నాడు.

పనిలేని పాపయ్య ఆట కట్టింది. పది రూపాయలూ ఇచ్చేశాడు.

"దోసకాయలు పోతే పోయాయిగాని లేచినవేళ మంచిదే!" అనుకుంటూ దోస కాయలవాడు ఇంటికి వెళ్ళిపోయాడు.



## శిలలుగా మారిన వృక్షాలు!

అమెరికాలోని అరిజోనా అరణ్యంలో శిలలుగా మారిన వృక్షాలు చాలా వున్నాయి. ఇరవై కోట్ల సంవత్సరాలకు పూర్వం వీచిన తుఫానులో 200 అడుగుల ఎత్తయిన వృక్షాలు విరిగిపడి, వాటి పైన మన్ను, ఇసుక మూసుకుపోవడంవల్ల, చెట్లు క్రమంగా శిలలుగా మారిపోయాయి. ఏడుకోట్ల సంవత్సరాల పూర్వం భూమి ఎదగడం ఆరంభమయ్యాక, ఈనాటి శిలాజాలు బయటపడ్డాయి.



## ఎరిబస్ పర్వతం



ఆంటార్కిటికాలోని ఎరిబస్ పర్వతమే దక్షిణాగ్రంలో వున్న సజీవ అగ్ని పర్వతం. ఇది 12,450 అడుగుల ఎత్తు కలిగివున్నది. ఈ పర్వతబిలం అంటే జ్వాలాముఖం 2,600 అడుగుల అడ్డుకొలత కలిగి ఉన్నది.

## అత్తిపత్తి మొక్క



మిమోసాపుడికా అనే ఒకరకం తుమ్మ జాతి (అత్తిపత్తి) మొక్కను తాకితే చాలు క్షణాలలో ఆకులన్నీ ముడుచుకుపోతాయి. ఆ తరవాత కొంతసేపటికి నెమ్మదిగా యథాస్థితికి వస్తుంది।

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1990 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. R. Pimpalapure



A. V. Rangiah

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎత్తుకు ఎగరాలని తపన! రెండవ ఫోటో : ఎత్తుకోవడంలో లాలన!

పంపినవారు : ఆర్. ఆర్. కుమారి, అభిరామపురం, మద్రాసు—600 018

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.